వసిష్ఠుడు

(మళ్ళీ నాడిచూచి, పెదవులపై చిరునవ్వు కనబరుస్తూ) మీ అక్క సామాన్యురాలు కాదు నదిలో ఊతపట్టు తప్పగానే జల స్తంభనం గావించి సమాధిలోకి పోయింది. మెల్లగా బోధిల్ల గలదు. మీరు వనదేవతలా ?

(అంతలో అరుంధతి రెప్పలెత్తుతుంది రంగం తళుక్కు మంటుంది )

సంధ్య

అక్కా ! అక్కా ! (సంతోషంతో అరుస్తుంది) ఎంత ప్రమాదం గడిచిందక్కా !

అరుంధతి

సంధ్యా ! (ఆమె ముఖంలోకి సూటిగాచూస్తూ) ఏమి జరిగిందమ్మా ? (జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ, తిరిగి కళ్ళుమూసుకొంటుంది )

వసిష్ఠుడు

ఇక భయంలేదు. నేను పోయివస్తాను

(ఈమాటలు వినబడగానే త త్తరపాటుతో అరుంధతి లేచి నిలబడుతుంది అంతవరకు ఆమె వసిష్ఠుణ్ణి చూడనేలేదు తన దగ్గర కూర్చుని ముఖంలో ముఖం పెట్టుకొనివున్న సంధ్యను మాత్రమే చూచింది ప్రప్రథమంగా అతణ్ణి ఇప్పుడు చూచింది. సంభ్రమాశ్చర్యాలు విద్యుత్తరంగాలవలె శరీరమంతా వ్యాపించాయి రెప్పపాటుకాలం నిశ్చేష్టురాలైంది. వసిష్ఠుడు కూడ

సమ్మోహితుడై ఆమెనే చూస్తున్నాడు నదీగర్భంనుంచి తాను రక్షించిన తపస్విని కా దీమె! మరిం కెవరు? అయితే ఇంత క్రొత్తగా కనిపిస్తున్న దేమిటి? ఉషఃకాంతిలో సంధ్యకన్న ముందు తాను దర్శించిన దివ్యమూర్తి ఈమే!)

సంధ్య

అక్కా! ఆపద్బాంధవులకు అభివందనం చెయ్యి!

అరుంధతి

ఋషికుమారుల ఋణం తీర్చుకోలేం (అంజలి ఘటిస్తుంది.)

వసిష్ఠుడు

(*తిరిగి అంజలి ఘటిస్తూ*) నన్ను మీరు క్షమించాలి మీరు సామాన్య మానవులనుకొని రక్షణచర్య కుద్యమించాను. నా అవజ్ఞతను మన్నించి—

సంధ్య

మన్నించం

అరుంధతి

(*కోపంగా*) సంధ్యా! ఎవరితో మాట్లాడుతున్నావో కొంచెం గుర్తించు

సంధ్య

ఆర్తత్రాణ పరాయణుడు, అఖండ తపోధనుడు, అద్వితీయ సత్త్వ సంపన్నుడు, అరుంధతీ ప్రాణ—

అరుంధతి

(తీవ్రంగా) చాలించమ్మా, చాలించు. (వసిష్ఠునితో) ఆర్యా! ఈమె మర్యాద తెలియని మంకుపిల్ల క్షమించ గోరు తున్నాను

సంధ్య

పోనీ ఎందుకైనా మంచిది, క్షమించండి. ఇక ఆశ్రమానికి పోవడం ఉత్తమం అతిథిసత్కారం తరువాత యథేచ్ఛగా మాట్లాడుకోవచ్చు.

వసిష్ఠుడు

(పరధ్యానంగా) సంధ్యా! (నాలుక కరచుకొని) బాలా మణీ!

సంధ్య

(నవ్వుతూ) ప్రమాదం ఏదీ లేదు. పిలవడానికేగదా పేరు? మమ్మల్ని—ముఖ్యంగా నన్ను పేరుపెట్టే పిలవండి మా అక్కయ్య సంగతి నాకెందుకు ?

అరుంధతి

(వసిష్ఠునితో) ఇక మనం ఆశ్రమానికి వెళ్ళడమే—

వసిష్ఠుడు

(సందేహిస్తూ) ఏ ఆశ్రమానికి ?

సంధ్య

(కొంటెగా) మీ ఆశ్రమానికి ఏం ? రానివ్వరా ?

వసిష్ఠుడు

(పులకితుడై) అంత అదృష్టమూ నాకు? (అరుంధతివైపు చూస్తూ) నిజంగా మీరు మా ఆశ్రమానికి రాగలిగితే అప్పుడు ఆశ్రమ జీవితం ఎంత సౌఖ్యవంతంగా వుంటుంది! తపస్సు ఎంత ఆనందప్రదం అవుతుంది!

(దూరంగా, ఎక్కడో ఏదో పిలుపు వినిపిస్తుంది.)

సంధ్య

(ఆలకించి) ఎవరో పిలుస్తున్నట్లున్నది. నేను చూచి వస్తాను

(పరుగెడుతుంది అరుంధతి, వసిష్ఠుడు ఒంటరిగా వుండి పోతారు ఒకరినొకరు చూచుకుంటారు సహజమైన ఆకర్షణ పరస్పరం భక్తి తప్ప వారిమధ్య మరేభావంలేదు వసిష్ఠుడు బాలకుడైనా మహర్షి అరుంధతి బాలికయైనా తపస్విని స్త్రీ పురుష భావమే వారికిలేదు కాని, ఒక మహాశక్తి వారిని బంధించింది ఒకరి చూపులు ఒకరి సౌందర్య సీమలలో చిక్కు-కొన్నాయి అలా—ఏకానుభూతిలో వారు ఎంత సేపు ఆనందించారో తెలియదు క్షణకాలపు ఆత్మైక్యం అనంత యుగాల పరిచయాన్ని వారికి లభింపజేసింది సంధ్య ఎప్పుడు వచ్చిందో వారు గుర్తించనేలేదు ఆమె ఇద్దరికేసి పరీక్షగాచూచి, అరుంధతి చేయిపట్టుకొన్నది)

అరుధంతి

(తెప్పరిల్లి) సంధ్యా!

వసిష్ఠుడు

(నిట్టూర్చి) ఇక నేను పోయిరానా మరి ?

సంధ్య

ఎక్కడికి ?

అరుంధతి

మా ఆశ్రమానికి రారా ?

(మళ్ళీ దూరంలో పిలుపు "వసిష్ఠా" అని )

వసిష్ఠుడు

ఆ పిలుపు నాకోసమే. నా సహాధ్యాయి నాకోసం వెతుక్కుంటూ వస్తున్నాడు. ఇక నేను మసలడం బాగుండదు

అరుంధతి

మా ఆతిధ్యం ?

వసిష్ఠుడు

మరొకసారి

సంధ్య

పునర్దర్శనం ?

వసిష్ఠుడు

రేపే !

(నిష్క్రమిస్తాడు అరుంధతి, సంధ్య అతడువెళ్ళినదారి వెంట చూస్తూ నిలబడినారు. అరుంధతి దగ్గరగల ఒకపూలతీగను అనుకొన్నది ఇంకా ఆమె తేరుకోలేదు. స్నానఘట్టంలోని దుస్సంఘటన, తరువాతి అపూర్వ మధురానుభూతి ఆమెను

అయోమయం చేసివేసినై ఆ వనరంగంలో ఆలోచనలు నాట్యం చేస్తున్నై. చెక్కుటద్దాలలో చుట్టూవున్న ఎర్రటి పువ్వులు రూపురేఖలు దిద్దుకొంటున్నాయి. నిమీలిత నేత్రాలు కట్టెదుటి సరోవర సరోజాలపై వ్రాలి వికసిస్తున్నాయి బాగా తెల్లవారి పోయింది ఆర్ద్రనయనాలతో ఆమె దివ్యసౌందర్యాన్ని ఆలోకించింది సంధ్య! ఉత్తేజితురాలై అరుంధతి చెక్కిలిమీటి, ఆమె చుట్టూ నాట్యంచేస్తూ సంధ్య పాడసాగింది ).

సంధ్య

మేలుకో!
చెలి! మేలుకో!!

విచ్చినదే తామరసము
త్రచ్చినదే ప్రేమరసము,
ముచ్చటగా వెదకి, వెదకి
తెచ్చినదే నీపెదవికి
మేలుకో!
చెలి, మేలుకో!!

కనకాంబర కోరకమున
కల నిజమై వచ్చినదే!
నీలాంబర పక్శెరమున
నీకోసము నిల్చినదే!
మేలుకో!
చెలి, మేలుకో!!

గుండియలో గూడుతట్టి
కోకిల గొంతెత్తె నేడు,
ఆనందము గజ్జెకట్టి
అందియ మ్రోయించె చూడు
మేలుకో !
చెలి, మేలుకో !!

(రంగం అరుంధతి చిరునవ్వు కాంతితో నిండిపోయి, క్రమంగా దృశ్యం అదృశ్యమై పోతుంది )

## తృతీయ రంగం

(వేదవనంలో మరో దట్టమైన అరణ్యభాగం ప్రొద్దు పొడుపువేళ చెట్లనీడల్లో చేరుకొని పక్కలు పరుచుకొంటు న్నాయి చీకట్లు వాటినిచూచి ఈలపురుగులు ఒక్కటే మోతగా మొరుగుతున్నాయి. గుడ్లగూబలకు చత్వారపు జోళ్ళను కుదురు స్తున్నాయి సాలెగూళ్ళు రాత్రి తన మకాం లేపుకొని ఉషః కాంతి రూపంతో తరువాతి మజిలీకి పోతున్నది యజమాని వచ్చిన కార్యాలయంవలె సూర్యోదయంతో అరణ్యం సద్దణగింది దూరంలో సూర్య నమస్కారం వినిపిస్తుంది. క్రమంగా అది సమీపిస్తుంది శ్లోకాన్ని బిగ్గరగా వల్లించుకొంటూ కులగిరి ప్రవే శిస్తాడు దిక్కులుచూస్తూ, మధ్యమధ్య బెదురుతూ వుంటాడు.)

కులగిరి

"బ్రహ్మాస్వరూప ముదయే
మధ్యాహ్నేతు మహేశ్వరమ్
సాయం ధ్యాయే త్సదా విష్ణుం
త్రిమూర్తించ దివాకరమ్."

(వడివడిగా కొంత సేపు వల్లించి)

అ అబ్బా! వ్వైధవ చదువు చ్చదువుకంటే చ్చాకలిపని మెరుగు. (దిక్కులుచూస్తూ నడిచి, కాలికి ఏదో తగిలి బోర్లపడి, లేచి దులుపుకొంటూవుండగా చాలదూరంలో ఏదో పాట విని పిస్తుంది. ఉల్కిపడి చుట్టూ పరికిస్తాడు ఆలకిస్తాడు ఏమీ విని పించదు ఏదో కనిపెట్టినట్టుగా తల పంకిస్తాడు)

తెలిసింది! వ్వాళ్ళే! వ్వసిష్ఠుడే అదృష్టవంతుడు! అతడి తపస్సు ఫ్ఫలించింది రంభనో, ఊర్వశినో, క్కనీసం ఏ త్తిలోత్త మనో స్సంపాదించుకోలేకపోతే త్తపస్సెందుకు తగలబెట్టను?

వ్వాడొస్తే క్కనిపించే ద్దేవకన్యకలు నాక్కనపడరేం? నేను ప్రొద్దెక్కి రావడమే క్కారణం కావచ్చు. వ్వైధవది, మ్మెలు కువే రాదు! ఏనాటికానాడే— వ్వెధవ ప్రొద్దు రోజూ ఎక్కి పోతూనేవుంది న్నేడేమైనాసరే, ఆ స్సౌందర్యవతుల్ని చ్చూడ కుండా వ్వెళ్ళను

(కొంచెం ముందుకు నడుస్తాడు. సంకోచంతో ఆగు తాడు)

వసిష్ఠుడక్కడే వుంటే? వాళ్ళ స్నేహం లభించిన నాటినుంచీ అక్కడే అతడి మకాం! సంధ్యావందనానికని అ అర్ధరాత్రే బైలుదేరతాడు. జాము ప్రొద్దెక్కి వస్తాడు! సమిధలకని పోతాడు. సంధ్యవాల్చి వస్తాడు! వహ్వా! వసిష్ఠా! ఏం ఇంద్రభోగమోయ్!

(మరికొంత దూరం పోయి)

ఆఁ! ఇ ఇదేదో ఆశ్రమంలాగేవుంది. అది ఇఇదే కావచ్చు (శబ్దం) వస్తున్నారనుకుంటాను. ఏం చెయ్యాలో! ఎలా పలకరించాలో!

(శబ్దం వినిపించిన దిశనుంచి ఏదో ఒక మృగం బైటికి వచ్చి కులగిరిని చూచి పారిపోతుంది వెనుకనుంచి "కాంద్రు" మనే అరుపుతో శివోహం రంగంలోకి దూకుతాడు కులగిరి కంగారెత్తి పోయి, "బాబోయ్" అంటూ గెంతి, శివోహాన్నే కౌగిలించుకుంటాడు.)

శివోహం

(*కులగిరివీపు తడుతూ*) భయంలేదు. భయంలేదు వత్సా! నేనున్నాను. నేనున్నాను

కులగిరి

(*కళ్ళు తెరవకుండానే*) ఎవరు నీవు? ఎక్కడున్నావు?

శివోహం

ఇక్కడున్నాను ఎక్కడా వున్నాను.

కులగిరి

అంటే?

శివోహం

నీలో, నాలో, నీ భయంలో, నా అభయంలో—అన్నట్టు మరిచిపోయాను. ఇదిగో అభయహస్తం (చేతిలో చేయివేస్తాడు)

కులగిరి

(శివోహంవంక బాగాచూస్తూ) నీ వెవరు ?

శివోహం

నేను పక్షినిగాను, మృగాన్ని కాను, జలచరం అంత కంటె కాను మనిషినోయ్! మనిషి! నేను మనిషిని!!

కులగిరి

నిన్ని దివరకెప్పుడూ చూడలేదు.

శివోహం

నీ వీ పల్లె కెప్పుడూ రాలేదు.

కులగిరి

ఏ పల్లె ?

శివోహం

మాదిగపల్లె

కులగిరి

అంటే ?

శివోహం

మాతంగ వాటిక.

కులగిరి

(*ఒక్క గొంతులో దూరంగాతప్పుకొంటూ*) చ్ఛంపావురా కోతివెధవా ! చ్ఛంపావురా !

శివోహం

(*కొంటెగా నవ్వుతూ*) నీవింకా అటు వెళితే నిజంగానే చస్తావు.

కులగిరి

పో్పిరా, పోకిరీ !

శివోహం

నిజమేరా, అటువెళ్లకు అక్కడ ఇప్పుడే ఒక పెద్దపులిని కట్టివేసి వచ్చాను ఇందాక నిన్ను భయపెట్టిందదే !

కులగిరి

(*జంకి*) మ్మరి నీవు మీదకురాకు

శివోహం

వస్తే ?

కులగిరి

పులినోట్లోనన్నా చ్చస్తానుగాని, నిన్నుమ్ముట్టుకోను

శివోహం

పడిసినట్టుగా వుంది–నీ సిద్ధాంతం ఎవడు బోధించాడురా నీ కది ? మనిషిని తాకవ్ ? పెద్దపులి నోట్లో చస్తావ్ ? వహ్వా ! వహ్వా !!

కులగిరి

న్నువ్వు చ్చండాలుడివి. చండాలస్తు జనితో— జనితో— జ్జనితో—(జ్ఞాపకంరాదు పాపం)

శివోహం

ఏదో లే, ఏడుపు. మనిషినుంచి మనిషిని విడదియ్యడానికి మహా వాక్యాలు ఉదహరించక్కర్లేదు.

(తెరలో పెద్దపులి అరుపు, తర్వాత ఒక బాల పిలుపు— "ఓరే శివోహం! దాన్ని విడిచి పెట్టెయ్యరా!" అని)

కులగిరి

(*కంగారుగా*) ఒరే! బ్బాబు! న్నేను పారిపోయేదాకా ద్దాన్ని వ్విడిచి పెట్టకురా! న్నీకాళ్ళకు మ్మొక్కుతా! (*వెనక్కి తిరిగి పారిపోతాడు*)

శివోహం

(*పగలబడి నవ్వుతూ*) ఓరి, నిన్ను తగలెయ్యా! నిన్న తరిమే పెద్దపులి బైటిది కాదురా, లోపటిదిరా, నీ లోపటిది!! (*అదే నవ్వడం నవ్వుతాడు.*)

(తెర)

## చతుర్థరంగం

(వేదవనంలో అరుంధతి ఆశ్రమం. ఫలపుష్ప భరితమైన వృక్షలతాగుల్మాదులతో మనోహరంగా వుంటుంది. వివిధ మృగ

శకుంత సంతానం గీత నృత్యాదులను అభ్యసిస్తూ వుంటాయి ఆకీట మృగరాజం అక్కడ తమ ధర్మాల్ని అభ్యసిస్తూన్నాయి. దూరంలో పాటవినిపిస్తుంది. దట్టమైన వనంలో కాలాన్ని గుర్తించలేం దృశ్యంలోని వెలుగు నీడలు మధ్యాహ్న సమయాన్ని సూచిస్తున్నాయి. ఆ కంఠస్వరం అరుంధతిదే ! ప్రకృతి అంతా సావధానంగా వింటున్నది రంగంలో ప్రవేశించింది, అతిలోక సౌందర్యవతి అరుంధతి! ఓహో, ఆతేజస్సు ! ఆ రమ్యాలోకన దివ్యప్రభ ? వినీల మేఘ రాశిలో మిలమిల స్రవించి పోతున్న విద్యుల్లహరి వలె ఆమె తళుక్కు మంటున్న దా వృక్షచ్ఛాయలలో ? మధుర గానంలో తేలిపోతూ, మందారపుష్పాలు రెండందుకొన్న దామె )

అరుంధతి

మందారమ ! ఒక మంజరి నీవే !
మల్లీ ! వాడని మాలను తేవే!

మత్తిలకే ఓ మత్తకోకిలా !
మాకందమె నీ కందము చాలా !

ఉత్పల మాలిక లొప్పునటే ? ఈ
చంపక మాలిక చాలునటే ?

విశ్వములోగల పుష్పములారా !
వేంచేయరె పీయూషములూర ! !

(ఒక పాత్రతో సంధ్య ప్రవేశిస్తుంది. అత్యాశ్చర్యంతో అరుంధతిని తిలకిస్తుంది. సంధ్యకు కూడ ఇది అపూర్వదృశ్యమే!)

సంధ్య

ఓహో! వసంతదేవత నాట్యంచేస్తున్నది! వసిష్ఠుని స్నేహంలో ఈమె పూర్తిగా నూతన వ్యక్తి అయింది! క్షణ క్షణమూ అపూర్వోత్క్రాంతిని పొందుతున్నది!

అరుంధతి

(ఒక పువ్వును చూపుతూ) సంధ్యా! దీన్ని చూడు! ద్యోవీథినుంచి దోసిట్లో రాలిన చంద్రబింబమనుకొంటున్నావా దీన్ని? (నవ్వుతూ) కాదు ఇది పువ్వే!

వరవసంతము లెన్ని వచ్చిపోయెనుకాదు?
ఏ ఋతువు తెచ్చెనే ఇంత నూతనశోభ?
ఏ సుధావర్ష ధారా సేచనమొ కాని
మార్చివైచిన దాశ్రమము నొక్కప్రొద్దులో!

సంధ్య

సత్యమే. ప్రకృతికి అనుగుణంగా నీవుకూడ మారావు!

అరుంధతి

నీవుకూడ.

సంధ్య

నీకు అనుగుణంగా!

అరుంధతి

కాదు, కాదు

పికము పాడుటకు, వల్లిక పల్లవించుటకు
సంబంధమేమిటే, సంధ్యాకుమారి ?
పరిణతి జెందుచుందురు ఎవ్వరికివారె,
నవమాసమందు నీ నా భేద మెచటిదే ?

సంధ్య

ఏమో, నా సంగతి నాకు తెలీదు నీవుమాత్రం ఇదివరకు కాలకంఠు పూజాపరురాలవు ఇప్పుడు కల్యాణనాట్యదేవతవు.

అరుంధతి

కాలకంఠుడు నటరాజు కాడా ?

సంధ్య

నటరాజుకు నాట్యమే కానుక, నీ ఉపాసనకు నేను అడ్డం రాలేదుగదా ?

అరుంధతి

అనుచారిణి నంటివికదా ? నా నాట్యంలో నీ వొక భంగిమవు కావలదా ?

సంధ్య

ఓ, తప్పకుండా కాంక్షితమే కర్తవ్యంకూడ అయితే అంతకన్నా కావలసిం దేముంది ?

(గిరున తిరుగుతూ, నాట్యంచేస్తూ)

నిన్నటి వరకును నిదురించితివా ?
నేడే కను దెరచితివా ?

ఈ ప్రణవాశ్రమమున కీనాడే
సుప్రభాత మో పూవా!

అంకురమ్ముగా, లోతునేలలో
బంకమన్నుగా బాధపడితివా?

మూగ మొలకవై, సాగి తీగవై
రాగ మొలుకవే, పూవా!

(ఆగి) మరి నీ వలానే నిలబడిపోయావే!

అరుంధతి

(నిట్టూర్చి) ఏమో! నా కాళ్ళు నేల కంటుకుపోయి కదలలేకుండా వున్నాను. అబ్బా! అడుగు లింత భారంగా వున్నా యేమిటి?

సంధ్య

ఆ భారం అడుగులది కాదు, ఎడదది!

అరుంధతి

కాదు, నీ పాటది! (ఆలోచిస్తూ) నిజంగా - ఈ పువ్వు గతజీవితం అంత దయనీయమా?

సంధ్య

కావచ్చు.

అరుంధతి

వెనుక ఎంతో తపస్సు లేనిదే ఈ లతాజీవితానికి ఇంత రమణీయ పుష్ప సాఫల్యత అబ్బదని నా ఉద్దేశం.

సంధ్య

నిరంతరం తపోముద్ర వహించి వుండే రాతిబండ మాాశేమిటి ?

అరుంధతి

నిత్యం నీ వేదో ఒక బండ సమస్యనే తెస్తూవుంటావు

సంధ్య

నీకీమధ్య మనస్సు మనస్సులో లేదులే వసిష్ఠుణ్ణి అడుగుదాం.

అరుంధతి

ఆయన రేపుగాని రారు అదే నన్ను ఆయాసపెడుతున్న తలంపు. ఇదేమిటో నా కర్థంకావడంలేదు ఒక మనిషి సాన్నిధ్యంకోసం మరోమనిషి బాధపడడం అపూర్వంకాదా, సంధ్యా ? ఇది మనోవైకల్యమా ? తపోవైఫల్యమా ? ఏమంటావు దీన్ని ?

సంధ్య

(నవ్వుతూ) నామాటకేంగాని, ప్రపంచమంతా "ప్రేమ" అంటుంది దీన్ని ఇది ఎప్పటికప్పుడే అపూర్వం ఎవరిమట్టుకు వారికే అభినూత్నం. దీని అనుభవం ఏ కణాని కా కణమే మధురతరం. అందరికీ అందేఫలంకాదది. అందుకొన్నవారు ధన్యులు. వారికి దేవతలే సేవచేస్తారని మన పరమశివుడు సతీదేవికి చెపుతుండగా విన్నాను.

అరుంధతి

ప్రేమ అంత దివ్యమయిందైతే, నన్నింత ఆరాటపెడు తున్నదేమిటి?

సంధ్య

నీ హృదయం ఇంకా పరిపక్వంకాలేదన్నమాట. ఔను— అదిప్పుడే వసంత కోకిల తొలి కాటు తిన్న క్రొంజిగురు మరి!

అరుంధతి

(కోపంగా) పో! మంకుపిల్లా!

(సంధ్య వెంటనే గిర్రున తిరిగి, 'నిన్నటివరకును నిదురించితివా' అని పాడుతూ, నిష్క్రమిస్తుంది అరుంధతి నిట్టూర్పు విడుస్తుంది. పైకి చూస్తుంది. మధ్యాహ్నం కావస్తున్నది వసిష్ఠుడి పరిచయంనాటినుంచి ఆమె అదోలా వుంటున్నది. ప్రతీప్రాతఃకాలం అతని దర్శనమవుతున్నా, గంటలకొలదీ అతనితో ప్రియోక్తులు సాగిస్తున్నా ఆమెకు తృప్తిలేదు. తపస్సు విఘ్నమైనట్టుగా భావిస్తున్నది ఒక్క తపస్సేకాదు, తన సర్వస్వమూ అతనికోసం త్యాగం చెయ్యగలదు కాని—? అసలు, వసిష్ఠుణ్ణి తాను చాల కాలం క్రితమే స్వప్నంలో చూచింది తన తపస్సు ఫలిస్తేనే గాని అతనితో పరిచయంకూడ దనుకొన్నది. ఇంతలో అనుకోని రీతిగా అతని పరిచయ మయింది. ఒక్క క్షణంలో ఇంత విషయం ఆమె మనస్సులో చిరు తరంగాలను రేపింది. ఆమెకదిలింది ప్రక్క లతాకాండంపై కూర్చున్నది, లేచింది)

**అరుంధతి**

ఎంతకాలము నుండి ఈక్షించుచుంటి నే
యమున కీ దారినే యరుగు నీ జడదారి !
బాలసూర్యుని రీతి, పర్వచంద్రుని భాతి
దిగివచ్చి నన్నింత పొగిలించునే నేడు !

(*క్షణం భావించి, ఉత్సాహవతియై*)

పొగులూ, దిగులూ ఏదీ నన్ను బాధించరాదు మహేశ్వ రారాధనకు మల్లె పువ్వులు సేకరించవలసివుంది.

(*ఇక్కడొక పువ్వూ, అక్కడొక పువ్వూ అందుకొంటూ*)

వికసింపుము, వికసింపుము, మల్లీ !
విహరింపుము చిరునవ్వులు, జల్లి !
పూజా గృహముల, ప్రేమ హృదయముల
పులకింపుము చెక్కిలి గిల్లి !
మల్లీ ! మల్లీ !
మంజుల వల్లీ !
పరభృతమా ! మంత్రము గానింపుమ !
పరమేశుని రాగముతో నింపుమ !
జగ మనురాగసమేతము కాగా
ప్రగతి కాగడాలను వెలిగింపుమ !
పరభృతమా ! మరి
త్వరపడుమా !

(పుష్పాపచయం చేస్తూ, పాడుకొంటూ అరుంధతి దూరంగా వెళ్ళిపోతుంది. పాటకూడ దూరమై పోతుంది. అప్పుడు మరో ప్రక్కనుంచి వసిష్ఠుడు ప్రవేశిస్తాడు. దిక్కులు పరికిస్తూ మెల్లగా అడుగులు వేసుకొంటూ పురోగమిస్తాడు)

వసిష్ఠుడు

వసంత మధ్యాహ్నాల శోభను ఈ మాకంద వృక్షచ్ఛాయల్లో అనుభవించ వలసిందే !

చింతనిప్పులవోలె వర్షించుచున్న
చండ భానుకరాలు శీర్షమున దాల్చి
ఆశ్రితుల కిందుకలశాల అమృత మొసగు
శివుని దలపించుచున్న వీ చెట్లగములు.

(ఈ ఆశ్రమం అతడికి రోజురోజు వినూతనంగానే కనిపిస్తున్నది నేడు మరీ ఆనందకరంగా వుంది. ఉదయ సంధ్యా సమయాలలోనే అతడీ దారికివస్తూ, అరుంధతితో సంభాషించి పోతూ వుంటాడు. ఈ వేళ మధ్యాహ్నం వచ్చాడు తన ఈ విచిత్రచర్య తనకే ఆశ్చర్యంగావుంది. ఇప్పుడు ఆశ్రమంలో ఎక్కడ చూచినా అరుంధతి పాదముద్రలు, హస్తముద్రలే కనిపిస్తున్నాయి ! అడుగుల్లో అడుగులు వేసుకొంటూ, చిగురు గుర్తుల్ని తాకుతూ, అతడు పరిక్రమిస్తున్నాడు )

పసిడి పుప్పొడి నొకచోట, పల్లవముల
నొక్కచోట, అనేకము లొక్కచోట,

ఒక్కచో ఒక్కచోటగ పెక్కు గతుల
ఆపుచున్న వీ రాగ చిహ్నములు నన్ను

అరుంధతీ! నిత్యమూ నిన్ను తన ఒడిలో పెట్టుకొని ముద్దు లాడుతున్న ఈ ప్రకృతి ఎంత ధన్యురాలు!

నీ పాద నిర్మల నీరేజములలోన
ప్రకృతి చైతన్యమే పల్లవించె!
నీ తనూవల్లికానేక భంగిమలలో
ప్రకృతి శృంగారమే పరిమళించె!
నీ ప్రసన్నేక్షణానీక రేఖలలోన
ప్రకృతి రాగములె రూపము ధరించె!
నీ మంజు మంజుల ప్రేమావతరణలో
ప్రకృతియే నైజపారము తరించె!
నీవు ముందుకు పోవగా, నీడవోలె
ని న్ననుసరించి వచ్చుచుండినది ప్రకృతి,
ప్రకృతి ననుసరించిన త్వదభ్యర్థి నేను!
అద్దరివి నీవు, ప్రకృతి కిద్దరిని నేను!!

(వసిష్ఠుడు ముందుకు పరిక్రమిస్తాడు. ఎదర దూరంలో అరుంధతిని గుర్తిస్తాడు సంతోష స్వాంతు డవుతాడు అటుకేసి నిష్క్రమిస్తాడు. రెండవ ప్రక్కనుంచి అదేపాటను పాడు కొంటూ అరుంధతి ప్రవేశిస్తుంది. ఆమె మనస్సు పూర్తిగా పరమేశ్వర పూజాయత్తమై వుంది)

అరుంధతి

వికసింపుము, వికసింపుము, మల్లీ!
వినువీథుల పందిరులను డుల్లి,
మీలో నే నొక చెల్లిని గానా?
మీతో మింటికి పర్విడ లేనా?
చక్కని మల్లీ!
చుక్కల తల్లీ!!

(వెనుకనుంచి మెల్లగా వసిష్ఠుడు ప్రవేశించి, ఆనందంతో ఆమెను తిలకిస్తాడు అరుంధతి హఠాత్తుగా ఆగి, వెనుదిరిగి చూచి, చకితురాలవుతుంది తమకు తెలియకుండానే ఒకరి నొకరు సమీపిస్తారు అరుంధతి ప్రణమిల్లుతుంది వసిష్ఠుడు కంపితగాత్రుడై ఆమెను వారించబోతాడు అరుంధతి అవనతవదనంతో అంజలిఘటించి ఒకప్రక్కగా నిలుస్తుంది. క్షణంసేపు ఇద్దరూ మౌనంగా వుంటారు)

అరుంధతి

పరమేశ్వరుడే సాక్షాత్కరించా డనుకొన్నాను!

వసిష్ఠుడు

నేను అలానే అనుకున్నాను. అలానే అంటే—
(*తడబడతాడు*)

అరుంధతి

(నవ్వుతూ) వివరణ అక్కరలేదు లెండి.

వసిష్ఠుడు

ప్రకృతి—వన దేవత—వనితారూపంలో—

అరుంధతి

ఆగండి. మీరు నిజంగా పరమేశ్వరుడే కాగలరు మీరు మరచివచ్చిన భూషణాలివిగో! (సమీపంలో ఒక మల్లెతీగపై వేసివుంచిన ముద్దమల్లెదండలు తీసి వసిష్ఠుడి కిస్తుంది. అవి నిజంగానే తెల్లత్రాచులవలె మిలమిలలాడుతున్నాయి)

వసిష్ఠుడు

(మాలను అందుకొంటూ) ఇది తెల్లత్రాచుకాదు! పూజా పుష్పమాల!

అరుంధతి

పరమేశ్వరుని ఫణిమాల, మానవుల మణిమాల, పూజలో పుష్పమాలలేగదా?

వసిష్ఠుడు

(స్పష్టంగా అర్థంగాక) అంటే?

అరుంధతి

మీరు పరమేశ్వరులైతే అది ఫణిమాలగా వుండేది. మీరు మానవులైతే మణిమాలగా మారేది.

వసిష్ఠుడు

ఓహో!

అరుంధతి

మానవత్వంనుంచి దివ్యత్వానికి పురోగమిస్తూ ఇప్పుడు మీరు మధ్యదారిలో వున్నారు అందుకే ఈ మాల పూజా పుష్పమాలగా మిమ్మ అలంకరించింది.

వసిష్ఠుడు

బాగుంది! (దండ తిరిగి ఇచ్చివేస్తాడు అరుంధతి దానిని అందుకొని అతని మెడలోనే వేస్తుంది)

అరుంధతి

ఇది మీకోసమే రచించబడినట్టిది

వసిష్ఠుడు

(అభ్యంతరసూచకంగా) నాకోసమా? నేను విరాగిని నాకీ రాగచిహ్నా లెందుకు?

అరుంధతి

రాగ విరాగా లంటే?

వసిష్ఠుడు

చీకటి వెలుగులు పోనీగాని నీకు ప్రత్యామ్నా ఏ మివ్వను?

అరుంధతి

ఆ తులసిమాల!

వసిష్ఠుడు

(పకృనవ్వి) నన్ను రాగినిచేసి, నీవు విరాగిణి వవుతావా?

అరుంధతి

రాగవిరాగాలకూ, ప్రకృతి సిద్ధమైన పుష్పాదులకూ సంబంధ మేమిటి చెప్పండి ? పూలమాలతో మీరు అరుంధతి, జపమాలతో నేను వసిష్టుడు కాగలమా ?

వసిష్ఠుడు

అయినా, రాగం జీవస్వరూపం. విరాగం బ్రహ్మస్వరూపం

అరుంధతి

కాగా, విరాగంనుంచే కదా రాగం పుడుతుంది ?

వసిష్ఠుడు

అది తిరిగి విరాగంలో పర్యవసించడమే మోక్షం

అరుంధతి

అది తిరిగి జీవ స్వరూపం తాల్చకపోతే ప్రపంచమేది ? నదీ జలానికి సాగర సంగమమే పరమావధి అయి—అంతటితో ముగిసిపోతే, మేఘ వర్షాదులు లేక, అసలు నదే లేకుండా పోదా ?

వసిష్ఠుడు

(ఆలోచిస్తూ) అసలు మోక్షమనేదే లేదంటావా

అరుంధతి

ఆ విషయం మీ దగ్గర ఉపదేశం పొందవలసినదానను

వసిష్ఠుడు

(ప్రముదిత చిత్తుడై) నీవు గొప్ప తాత్వికురాలివి, అరుంధతీ! స్త్రీలలో ఇటువంటి బ్రహ్మజ్ఞత్వం అరుదుగదా!

అరుంధతి

(సిగ్గుపడి) బ్రహ్మపదార్థానికి స్త్రీపురుష భేదమా ?

వసిష్ఠుడు

(ముగ్ధుడై ఆమెను చేరదీసుకొని) నేను నీలో పరబ్రహ్మనే దర్శిస్తున్నాను !

అరుంధతి

(వినమ్రతతో) అది మీ ప్రతిబింబమే.

(వసిష్ఠుడు జపమాలతీసి అరుంధతి మెడలో వేస్తాడు ఆమె తేజోవతి అవుతుంది ఆమె కళ్ళల్లోకి దీక్షగా, ప్రీతిగా చూస్తాడు. ప్రకృతి పరమానంద భరితమైన లక్షణాలు చుట్టూ కొల్లలుగా కనిపిస్తాయి వారిద్దరిమీద ఆశ్రమంలోని వృక్ష లతాదులన్నీ పుష్పాలు విసిరాయి. పుష్పాదులు కురిసాయి శుకపికాదులు కల్యాణ గీతాలు గానంచేసాయి దూరంలో సంధ్యపాట వినిపిస్తుంది క్రమంగా దృశ్యం ఎర్రనై, చీకటై పోతుంది. అరుంధతీ వసిష్ఠులు కనిపించరు మరొక్కక్షణంలో రంగంమీద తెల్లటికాంతి ప్రసరించేటప్పటికి సంధ్య ఒక్కతే పాడుతూ కనిపిస్తుంది )

సంధ్య

వసంత హేలా - లసత్సుమాల
పసందు లేనోయ్ బ్రతుకు,
గులాబిపూల - విలాసలీల
దిలాసలేమో వెతుకు !

విచారమేలా - విహారవేళ
విభాత మేఘోద్గతికి?

మధూళి లేదా - సుధార్ధి కాదా?
ప్రధాన మభయం మదికి!

(సంధ్య పాడుకొంటూ నిష్క్రమిస్తుంది దృశ్యం అదృశ్యమై పోతుంది)

## పంచమ రంగం

(రంగంలో చీకటి క్రమంగా తెల్లగా, ఎర్రగా విరిసేటప్పటికి అరుంధతీ వసిష్ఠులు కనిపిస్తారు. అదే దృశ్యం. అవే అలంకారాలు. వసిష్ఠుని మెడలో పూలదండ, అరుంధతి మెడలో జపమాల. సంధ్య పాట ఎక్కడో వినిపిస్తున్నట్టే వుంది ప్రకృతి అంతా కలకల్లాడుతూవుంది. అరుంధతీ వసిష్ఠు లిద్దరూ ఒక అపూర్వానుభూతికి లోనై ఉన్నా రా సమయంలో)

వసిష్ఠుడు

అరుంధతీ!

ఈ వనము, ఈ లతాళులు, ఈ సుమాల
పరిమళమ్ము, లన్యము లింతవరకు నాకు,
కాని—నీ మైత్రిదొరకిన క్షణమునుండి
ప్రకృతియెల్లను నాకు ఆత్మకథయయ్యె!

నాకు నూతన చైతన్యాన్ని, నూతన దృక్పథాన్ని కలిగించి, నన్ను నవనూతన జీవిగా రూపొందించిన నీ ప్రేమశక్తికి నేను సర్వదా కృతజ్ఞుణ్ణి!

అరుంధతి

ఋషికుమారా! మీరు చెప్పిన సత్యం నా విషయంలోనే వర్తిస్తుంది

పూచి పొదలు నదృష్టమ్ము నోచుకొనక
పుడమి యడుగులొత్తెడు గడ్డిపోచ నేను,
మునికుమారు నొక్కని ప్రేమపూజలోన
పారిజాతము కాగల భాగ్య మబ్బె!

వసిష్ఠుడు

అలాకాదు నీవు పుట్టుకతోనే పూజాపుష్పానివి. నీవు నాకు లభించి నేను ధన్యుణ్ణయాను ఇప్పుడు మనం జీవబ్రహ్మాలం. ఈ విశ్వం మన నాట్యరంగం

ఆ బాలతృణపూర యమునాప్రతీరాల
హరిణ శాబము లట్టు లాడుకొనుచు,
ఈ యామ్రతరులతాచ్ఛాయాగృహమ్ముల
పరభృతమ్ములవోలె పాడుకొనుచు,
ఆ రాగపరిపక్వ నీరేజవనముల
రాయంచ లట్లు నీరాడుకొనుచు,
ఈ సరస్సీమంతినీ సైకతోత్సంగ
శయ్యాతలాల విశ్రాంతిగొనుచు,

వేగుసమయాల, మధ్యాహ్న వేళలందు,
శాంతసాయంతనముల, నిశ్శబ్దనిశల
ప్రేయసీ! నీవు నే నొక్క రీతి గలిసి
నటనచేతము ప్రకృతి రంగస్థలాన!

(ఉద్రిక్తుడై ముద్దు పెట్టుకోబోతాడు చుట్టూవున్న వృక్ష లతా గుల్మాదులు తెల్లబోతాయి! శుక పికాదులు కంగారు పడతాయి! అరుంధతి చిరునవ్వుతో వసిష్ఠుణ్ణి వారిస్తుంది)

అరుంధతి

మహాసంయమీ! సంధ్య వస్తున్నది చూడండి! పిచ్చిపిల్ల! నృత్యగానాలే నిత్యం ఆహారాహార్యా లామెకు! (సమీపంలో పాట వినిపిస్తుంది వసిష్ఠుడు తమాయించుకొని అటుచూస్తాడు. అప్పటికే సంధ్య రంగంలోకి వచ్చేస్తుంది—వసంత హేలా—అని పాడుకొంటూ ఆమె నీలిరంగు దుస్తుల్ని ధరించి వుంటుంది అక్కడ హఠాత్తుగా అరుంధతీ వసిష్ఠుల్ని చూస్తుంది. ఆశ్చర్య పడుతుంది. అంజలి ఘటిస్తుంది)

సంధ్య

ఓహో! అచ్చంగా మీరు సతీ సాంబశివులులాగ వున్నారు! లేక నిజంగానే సంధ్యాసమయ విహారార్థం వచ్చారుగీనా? (*ఇద్దర్నీ పరిశీలించి చూస్తుంది*) ఔను — మీరు అరుంధతీ వసిష్ఠులే!

వసిష్ఠుడు

(నవ్వుతూ) పూర్తిగా అనుమానం తీరినట్టేనా? ఇంకా పరిశోధించవలసివుందా?

సంధ్య

పరిశోధన మిమ్మల్ని పార్వతీ పరమేశ్వరుల్నే చేస్తుంది దానివల్ల నాకు లాభంలేదు

అరుంధతి

(పైకిచూచి) ఎంతలో సంధ్యాసమయ మయింది!

వసిష్ఠుడు

ఆశ్చర్యమే! సంధ్యా! ఇంతతొందరగా వచ్చేశావేం?

సంధ్య

(విచారంతో) ఆఁ! మీ ఆనందానికి ఆటంకం కలిగించానా? అయితే నిజంగా నన్ను మీరు క్షమించాలి

వసిష్ఠుడు

(నవ్వుతూ) ఓహో! క్షమించు, సంధ్యా! నే నన్నది నిన్ను కాదు సాయంసంధ్యను మధ్యాహ్నం ఎంత త్వరగా సాయంత్ర మెపోయింది!

అరుంధతి

(వసిష్ఠుడితో) ఈమెను మీ రెరుగుదురా? ఈమె —

వసిష్ఠుడు

(కొంటెగాచూస్తూ) ఈమెను నే నెరగనా? నను నేను మరచిపోయినా, సంధ్యను నేను మరువను.

అరుంధతి

(చిరునవ్వుతో) మీ రెరిగిన ప్రాతః సంధ్య కాదీమె. ఈమె సాయంసంధ్య.

వసిష్ఠుడు

ఆశ్చర్యంగా వుంది !

అరుంధతి

ఇద్దరూ ఒకే రూపంలో వుంటారు. ఉదయం, సాయంత్రం వంతులు వేసుకొని ఒకతె నాదగ్గర వుంటుంది ఒకతె పితరులను సేవిస్తూ చంద్రభాగాతీరంలో వుంటుంది దుస్తులతేడా లేకపోతే ఈ యిద్దరిలో ఎవరెవరో, ఎవరూ తెలుసుకోలేరు

సంధ్య

మాఅక్క మాటలు నమ్మకండి, నే నొక్కతనే ఇద్దరమనుకొంటుం దామె !! (పకపకా నవ్వుతుంది) ।

వసిష్ఠుడు

ఇది మరీ అద్భుతంగా వుంది ! ఈమె నిజంగా నే నెరిగిన సంధ్య కాదు

సంధ్య

మీ రెరగనిది నన్ను కాదు, నా అవస్థను ప్రతిదినం ఈ వేళకే రండి. ఎన్ని ఆకర్షణలు—ఎన్ని అనుభూతులు మిమ్మల్ని ముంచెత్తుతాయో !

వసిష్ఠుడు

అవన్నీ నా కెందుకు ?

సంధ్య

ఈ సౌందర్యమంతా, ఈ రుచులన్నీ మానవుని కోసం కాకపోతే మానుకోసమూ! (*సమీపంలో గల పాత్ర అందుకొని*) ఇంతకీ, నేనీ పాత్రకోసం వచ్చాను. (*అరుంధతితో*) నీ మొక్కలకు కూడ ఇవాళ నేనే పోస్తాలే నీళ్ళు (*నిన్నటి వరకును నిదురించితివా—అని పాడుకొంటూ సంధ్యా నిష్క్రమిస్తుంది.*)

అరుంధతి

(*చిరునవ్వుతో*) ఇక మనం సంధ్యవార్చి వద్దాం

వసిష్ఠుడు

అవశ్యం, (*ముందుకు నడుస్తాడు* )

అరుంధతి

ఆ కమండలువు ఇలా ఇవ్వండి

వసిష్ఠుడు

(ఇస్తూ) ఆ పూలసెజ్జ ఇలాఇయ్యి.

అరుంధతి

(ఇస్తూ) ఈ సంధ్యాదేవి మనలను తన రాగదృక్కులతో ముంచెత్తుతున్నది !

వసిష్ఠుడు

ఆ యపరదిశా లలాటఫలకంపై కుంకుమ రేఖవు నీవే ! లేకపోతే, దానికా రాగం ఎక్కడిది?

అరుంధతి

అది మీహృదయం పొంగిపొర్లుతున్న అనురాగం!

వసిష్ఠుడు

మనం పరస్పరోపాసకులం, అరుంధతీ! నన్ను నీవు, నిన్ను నేను చేరి పరిపూర్ణత్వాన్ని సాధించాం ఇప్పుడు మనం ఒకే అద్వైతం! నిండుసత్యం, అక్షరబ్రహ్మం!

అరుంధతి

(సజలనేత్రయై) ధన్యురాలను

(ఇప్పటికి ఇద్దరూ నదీజలాలకు సమీపంగా వచ్చారు. అవతలిగట్టుదాటి సూర్యుడు అప్పుడే కొండెక్కి వెనక్కి తొంగి చూస్తున్నాడు. దినమంతా ఎర్రకంకర బాటలలో ఎడ్లబండిలో ప్రయాణంచేసిన వస్తాదువలె అతడు పడమటికొండ చేరి దుమ్ము దులుపుకొంటున్నాడు అదేకాబోలు సంజకెంజాయ పేరుతో భూమిమీదకు రాలుతున్నది! తీరంలో—దూరంగా అక్కడక్కడ మహర్షులు సంధ్యవారుస్తున్నారు వేదవనంలో ఇంకా ఋష్యాశ్రమాలు ఉన్నట్టున్నాయి అరుంధతీ వసిష్ఠు లిద్దరూ పరస్పరం సంభాషించుకొంటూ, పరధ్యానంగా ముందుకు నడుస్తున్నారు అక్కడ సంధ్యావందనం చేస్తున్న ప్రాచీనుడు హఠాత్తుగా వారిని చూస్తాడు సంభ్రమాశ్చర్యాలతో అంజలిఘటిస్తాడు)

ప్రాచీనుడు

ఓహో! ఏమి నా యదృష్టం! నా తపస్సు నేటికికదా ఫలించింది! సతీసాంబశివులే నాకు ప్రత్యక్షమైనారు! ఆదిదంపతు

లారా! జగజ్జనకులారా! భక్తుడు సాష్టాంగపడుతున్నాడు!
(వారిముందు సాష్టాంగపడినాడు అరుంధతీవసిష్ఠులు దిగ్భ్రాంతులైనారు అతడెవరో అరుంధతి ఎరుగదు అందువల్ల విభ్రాంతి తరువాత ఈ సంఘటన ఆమెకు హాస్యాస్పదమయింది నిజంగానే తాము అలా వున్నారేమో! అంతకుముందే సంధ్యకూడ సరదాకే అయినా, ఆ మాట అనివున్నది! ఈ ప్రాచీనుడు ఎవరో వసిష్ఠుడికి తెలుసును వారిద్దరూ ఒకే ఆశ్రమంలో వుంటున్నారు ప్రాచీనుడు పెద్దవాడు, ఆచారపరుడు, కఠినవ్రతుడు, తీవ్రమనస్తత్వం కలవాడు. హాస్యాన్ని, అనాచారాన్ని సహించడు. అటువంటివాడితో ఈ సంఘటన! నిజంగా వసిష్ఠుడికి పై ప్రాణాలు పైనే పోయాయంటే అతిశయోక్తి కాదు ఇప్పుడెలాగ? ఏమి చెయ్యాలి? ఏదో చెయ్యాలిగా మరి? వసిష్ఠుడు తమాయించుకున్నాడు ధైర్యంచిక్కబట్టాడు. సహజస్వరంతో జవాబిచ్చాడు)

వసిష్ఠుడు

మహర్షి! నేను వసిష్ఠుణ్ణి, మీరునన్ను చాల క్షమించవలసి వుంది

ప్రాచీనుడు

(*కంగారుగాలేచి*) ఏమిటీ? ఎవరూ? వసిష్ఠుడా? కాదు, కాదు మీరు సతీ సాంబశివులే!

వసిష్ఠుడు

అది మీఆశీర్వచనం నేను మాత్రం వసిష్ఠుణ్ణే! క్షమాపణ కోరుకొంటున్నాను

ప్రాచీనుడు

(అనుమానంతో) నిజమా? వసిష్ఠుడవే? (కోపంఅణుచు కొంటూ) ఈమె ఎవరు?

వసిష్ఠుడు

ఒక తాపసకన్య, ఈ పరిసరాశ్రమ వాసిని.

ప్రాచీనుడు

పేరు?

వసిష్ఠుడు

అరుంధతి.

ప్రాచీనుడు

(అదరిపడి చెవులు మూసికొని)

హరి హరీ! అంటరాని, చూడరాని, చెప్పరాని చండాల కన్య! హరి హరీ! హరి హరీ! (గిరుక తిరిగి నిష్క్రమిస్తాడు.)

వసిష్ఠుడు

(రుద్ధకంఠంతో) చండాలకన్య?

అరుంధతి

ఆఁ! (ఇప్పటికిగాని పరిస్థితి తీవ్రతను ఆమె గుర్తించ లేదు)

వసిష్ఠుడు

ప్రాచీనా ! ప్రాచీనా ! (వెర్రిగా పిలుస్తూ అతడి వెంట నిష్క్రమిస్తాడు. అరుంధతి నిశ్చేష్టురాలై అలానే సాలభంజికలా వుండిపోతుంది ఒక్క పరుగులో సంధ్య రంగంలో దూకుతుంది )

సంధ్య

అక్కా! అక్కా! ఏమిటిది! అయ్యో! పలకదే! (కదిపి చూచి) అయ్యో ! కదలదే ! అక్కా ! అక్కా! (చప్పున ఆగి) చండాలకన్య? కదూ? ఔను చండాలకన్య! (అరుంధతివైపు సజలనేత్రాలతో దీనంగా చూస్తుంది క్రమంగా సంధ్యారాగం సడలిపోయి, అంధకారం అలుముకొంటుంది )

## షష్ఠ రంగం

(వసిష్ఠుని ఆశ్రమం వేదవనంలోనే ఇది మరోప్రాంతంలో వుంది యమునకు కొంచెందూరం అందువల్ల అరుంధతి ఆశ్రమంలోవుండే రామణీయకం ఇక్కడ లేదు అక్కడి సంస్కారంకూడ ఇక్కడ లేదు ఇదొక మహారణ్యాం. మానవ హస్త శిల్పచ్ఛాయలు ఇక్కడేమీలేవు అరణ్యాం స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను అనుభవిస్తున్న దిక్కడ సూర్యచంద్రాదులను గెల్చిన మహావృక్షాల నీడల్లో, బహిఃప్రపంచాన్ని బహిష్కరించిన కంటకకుజాదుల మాటులలో నిశ్చితంగా తపస్సు చేసుకొంటున్న ఆశ్రమమిది కాల మిక్కడ అలవాటువల్ల తెలియవలసిందే

తరుశిరాల చిరుశకుంతాలు బోధించవలసిందే. రంగంలో వెలుతురు క్రమంగా వికసిస్తుంది వసిష్ఠుడు ఒక లతావేదికమీద కూర్చునివున్నాడు. తపస్సులో వున్నాడో, నిద్ర పోతున్నాడో, దీర్ఘాలోచనలో మునిగివున్నాడో! అస్వస్థుడుగా కనిపిస్తున్నాడు పతులు ప్రాతఃకాలాన్ని ప్రకటిస్తున్నాయి. కళ్లు తెరచి, మళ్ళీ మూసుకున్నాడు లేచి ఎదరకు నడిచాడు. అక్కడ మళ్ళీకూర్చున్నాడు ఈ సమయానికే అతడు ప్రతిదినం అరుంధతి ఆశ్రమంలో వుంటూవుండేవాడు. ఇప్పటికే అక్కడ సంధ్యా నాట్యం ప్రారంభిస్తుంది ఎంత ఆనందమయ జీవితం వాళ్ళది ? అసలు జీవితమంటే అదే ఈ చీకటికాదు వసిష్ఠుడి మనస్సులో ఈ విషయమే వివిధగతుల్లో పరిభ్రమిస్తున్నది. చండాలకన్య ! ఎవరు ? ఆ దివ్యసుందరి !)

వసిష్ఠుడు

చండాలకన్య! ఆమెను చండాలకన్య అన్నవాడే చండాలుడు

ముఖబింబమందు సంఫుల్లమై బ్రహ్మ తే
జము సహస్రాబ్జతేజమున వెలుగు!
జిహ్వాగ్రమందు రాజీవాసనుని రాణి
నాల్గువేదములతో నాట్యమాడు!
నేత్రాంచలములందు నిఖిలలోకములేలు
ప్రణయ పరంజ్యోతి పర్యటించు!
తనువల్లియందు సుందరకళాకల్యాణ
విశ్వమోహన రుచి విన్యసించు!

దివ్యబాల అరుంధతీదేవి, అమృత
హృదయ నస్పృశ్యయనగ నో రెట్లు వచ్చె?
నరుని వెలిబెట్టి హింసించు నరుడు నరుడె?
మానవాభ్యుదయము కిది మంచిదగునె?

అరుంధతీ! నీవు చండాలకన్యవా? ఓ దివ్యసుందరీ! నీవు ఏ కులంలో పుడితే ఆ కులం, ఏ స్థలంలో పెరిగితే ఆ స్థలం, నీవు చూచిన, తాకిన—సత్కరించిన ప్రతి లవం పరమపావనమే కదా!

నీవంటి పరంజ్యోతిని కులం పేరుతో అవమానించిన ప్రాచీనుడి నాలుక నాలుక కాదు—గరిగమ్మ

ప్రాచీనుడికి మతిలేదా? కాదు, నాకు మతిలేదు ఆ స్థితిలో నిన్ను విడిచిపెట్టి వచ్చిన నేను క్రూరుణ్ణి నేనెందుకు వచ్చేశాను? ప్రాచీనుడు నా బుద్ధికి సంకెళ్లు తగిలించి తనతో ఈడ్చుకువచ్చివుంటాడు! నీవు నన్ను ఎందుకు పోనిచ్చావు?

ప్రియా! నీ హృదయానికి చిచ్చుపెట్టి వచ్చేశాను! అది నిన్నెలా దహించివేస్తున్నదోగదా!

నేటి ఉదయం సంధ్య నాట్యంచేసిందా? నీవు నాకోసం ఎదురుచూస్తూ ఆ సహకారవృక్షచ్ఛాయలో కూర్చున్నావేమో! యమునాతీరంలో ఆ సంధ్యావందన ఘట్టంలో ఇంకా నిలబడే వున్నావేమో! ఇప్పుడేమిటి కర్తవ్యం?

(దూరంలో సంధ్య కంఠస్వరంతో పాట వినిపిస్తుంది వసిష్ఠుడు చాల ఆసక్తితో వింటాడు. అతని ముఖంమీద అనేక భావాలు రంగులురంగుల అలల్ని రేపి మాయమైపోతుంటాయి )

తెరలో

పంకజమని యే శంకించెదవా ?

పద్మము విడిచెదవా, మధుపా ?

కమలము, కల్హారము భేదములను

గమనింతువటో, సరసీ ?

ఖంగున మ్రోసే కంచుగంటలకు

బంగారపు నైవేద్యములా ?

వేకువదాటిన వేళనుకూడా

చీకటిమాటునె రవిని ?

వసిష్ఠుడు

(బిరాలునలేచి) సంధ్యా ! సంధ్యా ! (ముందుకునడిచి) నన్ను క్షమించు, సంధ్యా ! ఇదిగో వచ్చేస్తున్నాను (దురుసుగా వెళ్ళబోతూ, ఎదురుగా వస్తున్న కులగిరిని గుద్దుకుంటాడు )

కులగిరి

చ్చంపావోగస్, వసిష్ఠా ! అబ్బా ! "కామాతురాణాం నదారీ, నవేళా" అబ్బబ్బా ! అంత కళ్ళుమూసుకుని—(*శిరస్సు పట్టుకొని, తీక్షణంగా చూస్తాడు*)

వసిష్ఠుడు

(పశ్చాత్తాపంతో) క్షమించు, కులగిరి! చూడలేదు. (వెళ్ళబోతాడు)

కులగిరి

(వసిష్ఠుని చేయి పట్టుకొని) ఎక్కడికి? గురువుగారు ఎక్కడికీ వ్వెళ్ళనివ్వవద్దన్నారు

వసిష్ఠుడు

నీకు గురువుగారు కాని, నాకు కాదు. నేను వెళ్ళక తప్పదు

కులగిరి

(నిశ్చేష్టుడై) ఆఁ! ఏమిటీ! పండంటి బ్రహ్మవంశంలో మ్మాలకూడు కక్కలి పేస్తున్నావ్!

వసిష్ఠుడు

"ఏకమేవాద్వయంబ్రహ్మ" అంటూ నీవు అప్పగించేవన్నీ అర్థంలేని చిలుక పలుకు లేనా?

ప్రాచీనుడు

(ప్రవేశిస్తూ) నీ యీ పలుకు లన్నీ ఆ మాదిగగూడెంలో నేర్చినవేనా?

(వసిష్ఠుడు మాట్లాడడు)

కులగిరి

నిన్నేనోయ్! వసిష్ఠా! నిన్నే!

ప్రాచీనుడు

వసిష్ఠా! ఎక్కడికి పోతున్నావ్? దుష్టస్నేహం దుర్మార్గాలలో నడిపిస్తున్నదా?

వసిష్ఠుడు

ఎవరు దుష్టులు? కుల, మత, స్త్రీ, పురుష విభేదశూన్యమైన పవిత్రస్నేహం దుర్మార్గాలకు ఎప్పుడూ నడిపించదు

ప్రాచీనుడు

(*వికటంగా*) పవిత్రస్నేహం! స్త్రీ స్నేహం—అందులోను చెండాలినీ స్నేహం— పవిత్రమా?

వసిష్ఠుడు

బ్రాహ్మణ చండాలత్వాలను ఎలా నిర్ణయించడం? కులమా కొలతబద్ద? సహకార వృక్షం రాజోద్యానంలో వలె మాలపేటలో ఫలించదా? పుట్టుకస్థలాన్నిబట్టి రుచులకు విలువ కట్టుదురా? అయినా—చెట్టుపుట్టి, ఫలించిన వెనుక గదా పెద్ద, చిన్న, తీపి, పులుపు, కోల, గుండ్రన కులనిర్ణయం? ఇక—స్త్రీ స్నేహం గురించి——

ప్రాచీనుడు

ఉపన్యాసం నేర్చావె! ఇక ఆర్య ధర్మానికి ఆధారం ఎవరు?

కులగిరి

"జన్మనా జాయతే శూద్రః
కర్మణా జాయతే ద్విజః

వేద పారంతు విప్రాణాం
బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః"
మ్మనం బ్రాహ్మలమోయ్, వసిష్ఠా! మనం బ్రాహ్మలం!

వసిష్ఠుడు

బ్రహ్మజ్ఞానమనే మాటనే ఉచ్చరించడానికి అర్హులు కాని యజ్ఞోపవీతధారులంతా బ్రాహ్మణులేనా, మహర్షి?

ప్రాచీనుడు

అయ్యో! ఎంత పతనమైపోయావు! పాపంచేసి పశ్చాత్తాప పడ లేనంతటి హీనస్థితికి దిగజారిపోయావే! స్త్రీ స్నేహం! వసిష్ఠా! తపోవృక్షానికి చీడపురుగు, ఆధ్యాత్మిక ఆనందానికి విషసర్పం, స్త్రీ స్నేహం!

వసిష్ఠుడు

స్త్రీ చీడపురుగు, విషసర్పం అయితే, సృష్టిలో అసలు స్త్రీత్వమే లేకుండాపోయేది కదా? శుద్ధనిర్గుణ పరతత్వంలో సగుణసుందర చైతన్యశక్తి స్త్రీయేకాదా? కారుమబ్బులలోని బంగరు సెలయేరు, గున్నమామిడి గుబురు కొమ్మలలోని కోకిల పాట—

కులగిరి

(*ఊరుతూ*) అమ్మ! అమ్మ! "మాతంగకన్యాం మనసా స్మరామి"

వసిష్ఠుడు

(*ప్రాచీనుడితో*) ఆర్యా! విశ్వంభరం, శివంకరం, సుందరం ఆయిన రమణీమూర్తిని నిందించవద్దు. ఆమె ప్రేమ

మయి రసాత్మక చైతన్యశక్తి ఈ సకల కళాకల్యాణమూర్తిని సాక్షాత్కరింపజేసుకో. నీ నిస్సంగ ప్రకృతినుంచి మరొక మెట్టు పైకెక్కి చూడు! నేను దర్శిస్తున్న ప్రేమజ్యోతిని నీవు కూడ దర్శించగలవు ప్రేమోపాసకుడు కానివాడు, దైవోపాసకుడు కూడ కాలేదు

ప్రాచీనుడు

(మొత్తుకొంటు) హరి హరీ! ఎంత అధఃపతనం! ప్రత్యక్షస్త్రీ ఆరాధనమే జగన్మాత ఆరాధన మంటున్నావా?

వసిష్ఠుడు

తప్పేమి? వివిధరూపగుణ మాధుర్యాలతో జగన్నాటకరంగంలో అవతరించిన మహాశక్తినే గదా జగన్మాత అనడం? తెరమీది సాకారబ్రహ్మను ఉపేక్షిస్తే, తెరవెనుక ఏమున్నది స్వామీ?

కులగిరి

"స్త్రియో మూలమనర్థానాం"

ప్రాచీనుడు

(చింతతో) తెరవెనుకటి నిరాకార మూర్తిని ఎంతలో మరిచావు, వసిష్ఠా!

వసిష్ఠుడు

అది నాకు బోధించనక్కరలేదు

ప్రాచీనుడు

ఇక, ఆ మాదిగపిల్లను విడిచిపెట్టవా?

కులగిరి

ఒకర్తకాదు, ఇద్దరండీ, గురువర్యా! ఇద్దరూ!

వసిష్ఠుడు

నీటినుండి తడిని విడదీయలేను పుష్పంనుంచి సౌరభాన్ని తొలగించలేను అరుంధతీచంద్రిక లేని వసిష్ఠుడు కేవలం ఒక మంటి పెల్లమాత్రం

ప్రాచీనుడు

మరొకసారి ఆలోచించుకో! నీ మార్గానికి నేను అడ్డం రాను పైగా నీకు సహాయపడగలను మనం మిత్రులం. అయినా, ఆర్యజాతి సంరక్షకులం సమష్టిక్షేమం ముందు వ్యక్తిగత ప్రయోజనం తృణప్రాయం. ఇప్పుడు నీ నిర్ణయం మీదనే ఆర్యజాతి భవిష్యత్తు ఆధారపడివుంది నీచజాతికన్యతో - పవిత్రమైన ఆర్యజాతిని సంకరంచేసి, సర్వనాశనం చెయ్య దలిచావా? ప్రశాంతంగా ఆలోచించి, సమాధానం చెప్పుకో! తొందర ఏమీలేదు. యుగయుగాలకు, జన్మజన్మాలకు సంబంధించిన సమస్యను అనాలోచితంగా, క్షణాలపై ఉద్రేకంలో పరిష్కరించరాదు సమగ్రంగా ప రి శీ లిం చు. సమంజసమైన నిర్ణయం చెయ్యి స్వార్థానికి కళ్ళెంవేసి, త్యాగాన్ని ముందుకు రానీ!

(నిష్క్రమిస్తాడు)

కులగిరి

ఊర్వశీపుత్రు డనిపించుకోకయ్యా, వ్యసిష్ఠా!

(నిష్క్రమిస్తాడు)

వసిష్ఠుడు

(నిర్భ్రేష్ఠుడై) ఆర్యజాతి భవిష్యత్తు! (తల రెండుచేతుల తోను పట్టుకొని ఒక బండపై కూర్చుంటాడు దృశ్యంక్రమంగా అయోమయమైపోతుంది)

## సప్తమరంగం

(అదేరంగం అదే సమయం. వసిష్ఠుని ఆశ్రమంలో వెనుకభాగం బహుదట్టంగా వుంటుంది అక్కడికి కులగిరి ఎందుకోవచ్చాడు హఠాత్తుగా ఆగాడు. బహుశా కొంచెం బెదిరాడనుకోవచ్చు వెనక్కి తిరిగి ఇటుకేసివచ్చాడు దూరంలో ఎవర్నో చూశాడు. పెదవి విరిచాడు)

కులగిరి

"అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం" పాపం, వసిష్ఠుడు! ఎలాటివాడు ఎలా అయిపోయాడు! మాదిగపిల్లలట! దేవకన్యకలనుకున్నాను ఇద్దరూ! నాకూడా స్నేహం కలపవోయ్ అంటే వినాడూ? స్వార్థపరుడు! గురువుగారు మంచిపని చేశారు మహా వూరి పోతున్నాడులే! తగినశాస్తి అయింది (ఏదో అలికిడి తగిలి, బెదురుతాడు) ఉష్! మొన్న ఆ చండాలుడు పెద్దపులిని మీదకు వదిలాడు, ఆ బెదురే నన్ను తరుముతున్నది (ఆలో చించి) దెయ్యాలుకూడ వున్నాయంటారు పెద్దలు మనిషి

చచ్చిన తర్వాత ప్పునర్జన్మ ఎత్తుతూ వ్వుంటే, మ్మధ్య ద్దెయ్యా లెక్కణ్ణుంచి పుడ్తున్నాయ్ చెప్మా! (అంతలో వెనకనుంచి ఒక పొదను చీలదీసుకొని సంధ్య ప్రవేశిస్తుంది కులగిరి అదరిపడి "బ్బాబోయ్" అంటాడు) బ్బాబోయ్! ద్దెయ్యం!!

సంధ్య

మునికుమూరా! నేను. నేను దెయ్యాన్ని కాను

కులగిరి

(కళ్ళు మూసుకునే) మ్మరి - మరెవరు?

సంధ్య

నేనా? (సందేహిస్తూ) నేను

కులగిరి

అదే, ద్దెయ్యాలకి పేర్లుండవు న్నేనంటే ఆత్మ అదే దెయ్యం!

సంధ్య

అదే కాదంటున్నాను కొంచెం కళ్ళు తెరిచిచూడు నీ సహాయం కోరివచ్చిన ఒక ఆపన్నను నేను

కులగిరి

"ఆపత్కాలే నాస్తి మర్యాదా" న్నీ పేరు చెప్పు! (కొంచెం కళ్ళు తెరిచి) ఎవరు నీవు? దెయ్యం కాకపోతే ద్దేవత వ్వైనా అయివుండాలి (బాగాచూచి) ఆఁ! న్నిన్నెక్కడో చ్చూచినట్టుందే!

సంధ్య

మరి, మీ గురువుగారి కేమని చెపుతావు ?

కులగిరి

చ్చూడ లేదని చ్చెపుతాను

సంధ్య

బ్బ లేవాడివే! గ్గురువుగారికే పంగనామం పెట్టగల మ్మొన గాడివి!

కులగిరి

(నవ్వుతూ) మ్మరేమను కున్నావ్?

సంధ్య

ఈ చుట్టుప్రక్కల ఏదైనా కోనేరున్నదా ?

కులగిరి

ఎందుకు ?

సంధ్య

స్నానం చెయ్యాలి

కులగిరి

ఇప్పుడా ?

సంధ్య

నీవంటి పాపిష్ఠిని చూచినతర్వాత స్నానం చెయ్యకుండా ఎలా ?

(రంగంమీద రక్తకాంతి జిగేలు మంటుంది సంధ్యకోపాగ్నిలో కులగిరి మిడతలా అల్లాడిపోతాడు ఆమె బాణంలా నిష్క్రమిస్తుంది కులగిరి దిగ్భ్రాంతితో కూలబడతాడు )

## అష్టమ రంగం

(అదే రంగం - వసిష్ఠుని ఆశ్రమంలో ఒక భాగం ఒక బండరాతిమీద కూర్చుని వసిష్ఠుడు చింతాక్రాంతుడై వుంటాడు అతని ముఖంమీద వెలుగునీడలగమనం క్రమక్రమంగా తీవ్ర తరమవుతూ వుంది దూరంలో, సంధ్య కంఠస్వరంతో ఒకపాట దశదిశలా గాలిస్తున్నది )

తెరలో

ధారుణి ముంచుచు వారిధి పొంగిన
ఆవగింజలా ఆటంకం ?
ఉప్పొంగిన ప్రణయోదధి నాపగ
వర్ణవిభేదం వశమా ?
ఎదతో యెడదను స్వీకరించుటకు
స్వేచ్ఛలేని నీ జీవనమేలా ?
అణువు మొదలు బ్రహ్మము వర కొక టే
ఆత్మముగా తెలియగలేవా ?
శిథిలమైన నీ జీవితవాటికి
చేసికోవు వలసిన మరమ్మతులు !
ఆత్మ దైవతమె అరుదెంచినపుడు
మూఢా! తలుపులు మూసికొందువా?

(పాట వింటున్నకొలది వసిష్ఠుని ముఖంలో కాంతి హెచ్చింది హృదయంలో రేకలు వికసించాయి. ప్రకృతిలో బిగువు సడలింది. వసిష్ఠుడు లేచి నిలబడ్డాడు )

వసిష్ఠుడు

నేను మూఢుణ్ణే! ముమ్మాటికే మూఢుణ్ణే, సంధ్యా! ప్రేమలతను త్రెంచివెయ్యడానికి వడిపెట్టుతున్న క్రూరుణ్ణి!

నిజమా? నేను క్రూరుణ్ణా? కాను ఎన్నటికీ కాను. ప్రేమలతను అరుంధతి తెగనివ్వదు ఆమె కా శక్తివుంది

నాకు వర్ణభేదంలేదు నేను తలుపులు మూసికోలేదు నా అరుంధతి నాహృదయంలోనే వుంది సర్వత్రా ఆమె ప్రతిబింబిస్తున్నది

సంధ్య వార్చుట కేగి జలకమ్ము చేగొన్న
ప్రతిబింబమై అరుంధతియ తోచు,
మేత మేపుటకునై మృగశాబముల జేర
తన్నేత్రముల నరుంధతియ చూచు,
కందమూలముల చెంగట పోవ, కలకంఠ
రుతములతో నరుంధతియ పిల్చు,
కనుమూసి జపమాలికనుగొన్న, కాశరా
త్రజ్యోతిగా నరుంధతియ నిల్చు,
పడతి తనయంత విశ్వరూపము ధరించి,
నిండియున్నది నాగుండె నిండ తానె;
నేను నేను ప్రత్యణువును తానెయగుట
మాకు లేదు వియోగబాధాకులమ్ము

సంధ్యా! నీవు మీ అక్క దగ్గరకుపో. నేను క్షణంలో వస్తాను ఆర్య, అనార్య భేద భావాన్ని తునాతునకలుచేసి, ప్రాచీనుడి

నోరు మూయించి, ఈ పారతంత్ర్య వాతావరణంనుంచీ బైటికి దూకి వచ్చేస్తాను

అరుంధతీ! ఎంత కఠిన వ్రతానికి ఉపక్రమించావు! ఓహో! లోకంలో ఇంతకన్న ధన్యత ఏమి కలదు! నీవంటిదివ్య శక్తినా ప్రాచీనుడు తూలనాడాడు? పారిజాతపుష్పాన్ని ఏ పేరుతో పిలిస్తేనేం?

ఎంత పొరపాటు చేశాను! నీసాన్నిధ్య స్వర్గంనుంచి అనాలోచితంగా వచ్చి ఈ ప్రాచీనాశ్రమ కారాగారంలో పడ్డాను! జాతిసంకరభయంతో నన్నిక్కడ కట్టి వెయ్యడానికి చూస్తున్నారు! ఇంత తపస్సుచేసీ నేను మానవ బలహీనతకు లోనుగాక తప్పలేదు. నా దోషానికి నీకు ప్రాయశ్చిత్తమా? స్వపర భేదభావకాలుష్యంతో, నిమ్నోన్నత, ఉచ్చనీచ విచక్షణా పాపపంకిలంతో నేను బాధపడుతుంటే- శుద్ధిస్నానం నీకా?

తాత్కాలికమే అయినా, ఈ నా అసమర్థతకు అర్థం లేదు

కాడపై పూవు వాడిపోగలదు కాని,
పెరలలో తేనె సుఖమును పెంచగలదు,
అకట! నన్ను బోలిన అనామకుని పట్ల
ప్రణయసౌందర్యమెల్ల వ్యర్థమ్ముకాదె?

(అనిశ్చయతవల్ల ఆందోళన పెరిగి, ప్రక్కనుగల వృక్ష కాండ ఖండంమీద కూర్చుంటాడు చాల బెంగగా కనిపిస్తాడు.

అయినా ఒకస్థిర సంకల్పం అతని ముఖంలో మకాం వేసింది ఆ పరిస్థితిలో ప్రాచీనుడు ప్రవేశించాడు వసిష్ఠుడి తల్పై చేయి వేశాడు. వసిష్ఠుడు తలెత్తి చూచి, మౌనంగానే వుండి పోయాడు ప్రాచీనుడు అలానే నిలబడి వసిష్ఠునితల నిమిరాడు )

ప్రాచీనుడు

వసిష్ఠా! నీవింకా తేరుకోనే లేదా? (వసిష్ఠుడు మాట్లాడడు )

ప్రాచీనుడు

తేరుకోలేవు

(వసిష్ఠుడు తలపైకెత్తి ప్రశ్నార్థకంగా చూస్తాడు. ప్రాచీనుడు మెల్లిగా ప్రక్కకుపోతూ )

ప్రాచీనుడు

స్త్రీ వాంఛ!

వసిష్ఠుడు

(తీవ్రంగా చూస్తూ) స్త్రీ వాంఛ?

ప్రాచీనుడు

(తాపీగా) ఔను ఔను, మిత్రమా! ఔను నీ హృదయాన్ని దిగలాగుతున్న భారం, నీ నాడుల్ని కోస్తున్న కత్తి, నిన్ను ఆపాదమస్తకం దహిస్తున్న నిప్పు, నిన్ను తపోలోకం నుంచి పడద్రోస్తున్న దయ్యం – స్త్రీవాంఛ! వాంఛానివృత్తి చేసుకో! గతాన్ని మరచిపో. నిగ్రహం వహించు. నీ హృదయం

తేలిక అవుతుంది. నీ నాడులు చల్లబడతాయి నీవు లేచి నడవ గలవు.

వసిష్ఠుడు

(లేచి నిలబడి) చాలు, మిత్రమా! చాలు నాకు చెప్ప వలసిందేదో ఇదివరకే చెప్పావు ఇక ఈ కంఠశోష అనవసరం. నా దారిని నన్ను పోనీ వసిష్ఠుడు లేడనుకో తపస్సంపన్నుడవై ఆర్యజాతి నుద్ధరించు నా గురించి తాపత్రయపడకు నాజీవితం ప్రేమయజ్ఞంలో బలి అయిపోయింది

ప్రాచీనుడు

ప్రేమ! ప్రేమ అంటే? విశ్వమానవ కల్యాణాన్ని కోరేదే ప్రేమ! దాని సిద్ధికోసం చేసే నిష్కామకర్మే యజ్ఞం వసిష్ఠా! నీది ప్రేమకాదు. వట్టి కామం దానికి ప్రేమ అని పేరుపెట్టి, ప్రేమను అవమానించకు

వసిష్ఠుడు

(కోపంతో) ఏమంటున్నావు? ఎవరితో అంటున్నావు?

ప్రాచీనుడు

(మందహాసంతో) వసిష్ఠుడితో అంటున్నాను వేద వేదాంగ పారంగతుడైన, మహాతపస్సంపన్నుడైన, అన్నిటినీ మించి యువకుడైన వసిష్ఠునితో అంటున్నాను కోపపడకు. పరస్పర వాంఛ స్త్రీ పురుషులకు సహజం నీవు సహజం కాని దేదీ చెయ్యడంలేదు నీ వాంఛ తప్పుకాదు కానీ, నే ననేది దానికి అనవసరంగా పెద్దపేరు పెట్టవద్దనే

వసిష్ఠుడు

విశ్వమానవ కల్యాణభావం ఔదార్యం వాంఛావిలుప్త మైన నిష్కామకర్మ నీకు మోక్షాన్ని ఇవ్వవచ్చు నేనిప్పుడు కోరేది వాంఛామధురమైన రసానుభూతి

ప్రాచీనుడు

నీవు ఉన్మత్తుడవు. దేన్ని నీవు మాధుర్య మంటున్నావో అది సంసార సాగరంలో గాలానికి ఆకర్షించే ఎరమాత్రమే. వసిష్ఠా! స్వస్థుడవు కా.

వసిష్ఠుడు

ఈ జీవితంలో నా కిక స్వస్థత లేదు. నన్ను మరచిపో నేను పోతున్నాను.

ప్రాచీనుడు

ఎక్కడికి ? నీ వెక్కడికీపోలేవు నీ వాంఛనుంచి నీ వెక్కడికిపోగలవు ? వ్యర్థం పోనీ—నీ కా పిల్ల లభిస్తే సుఖంగా వుండ గలవా ?

వసిష్ఠుడు

ప్రాచీనా! నీవెంత కఠినుడివి! మధువులో విషంకలిపి నోటికందిస్తున్నావా ? నా ప్రేమను కామమని అవమానించావు నా స్నేహాన్ని వాంఛ అన్నావు. పైగా, జాతిసాంకర్య మన్నావు. కరకు బాణాలచే నా హృదయాన్ని వ్రయ్యలు చేశావు చాలు ఇక నన్ను పోనీ. నీ ఆశ్రమలతాకోరక మొకటి కాలవశాన గాలికి తెగిపోయిందనుకో.

ప్రాచీనుడు

నా ఆశ్రమలతాకోరకం ఏదీ, ఎట్టిగాలికీ తెగిపోరాదు. నీ జనని ఊర్వశి నీ రక్షణభారాన్ని నాపై పెట్టింది. నీ విప్పుడు యుక్తవయస్కుడవు. సర్వస్వతంత్రుడవు వివేకశాలివి. యమ నియమాది గుణవంతుడవు నేను నీకు మిత్రుణ్ణి నా సలహా పాటించు ప్రపంచానుభవంలేని యౌవనారంభం పెనుతుపానులో విడువబడ్డ నౌకవంటిది మిత్రుడు చుక్కాని పట్టినప్పుడే అది ఒక ఆశ్రయం చేరగలదు ప్రపంచ మహాసాగరంలో ఎన్నో జీవిత నౌకలు భగ్నం కావడానికి కారణం సరంగు లోపమే. నాసలహా విను నీవు గృహస్థాశ్రమాన్ని స్వీకరించు

వసిష్ఠుడు

నేను తపస్సు మానుకోలేను

ప్రాచీనుడు

నీవు తపస్సు మానుకోనక్కరలేదు. నీవు ఇప్పటికే మహా తపస్వివి యౌవనం పాలపొంగువంటిది అది మొదట చల్లార వలసివుంది అప్పుడుగాని నీవు నీచుట్టూ నాట్యంచేసే శత సహా స్రాధి కాకర్షణలను నిగ్రహించి నిలువలేవు నీకు తగిన తేజో వతిని వివాహమాడి, రాజయోగివికా

వసిష్ఠుడు

అరుంధతికంటె తేజోవతి యెవరు ?

ప్రాచీనుడు

ఓయి పిచ్చివాడా! చండాలకన్యకు తేజమా? మసి బొగ్గుకు రత్నద్యుతులా? బలేవాడివి! నీవు ఆమె నొక్కర్తినే

చూచి భ్రమపడుతున్నావు. ఆమె నొక తారా మాత్రంగా చేయగల ప్రచండరవితేజస్వీను లెందరో లోకంలో వున్నారు (ఆలోచించి, కొంత ఇసుకను పైకెత్తి) ఇదిగో— ఈ ఇసుకను అన్నంగా వండిపెట్టగలకన్య నీకు అర్ధాంగి కాగలదు ఇక నీవు స్వేచ్ఛగా పోవచ్చు, సెలవు

(ప్రాచీనుడు నిర్వికారంగా నిష్క్రమిస్తాడు, వసిష్ఠుడు కొంత సేపు అలానే నిలబడివుంటాడు. ప్రాచీనుడు వెళ్ళిన దారి వైపు, చేతిలోని ఇసుకవైపు పదేపదే చూస్తాడు తానిప్పుడు సర్వ స్వతంత్రుడు తనతల్లి తనను చిన్నప్పుడే ఈ ఆశ్రమంలో వదిలింది మళ్ళీ ఆమె కనిపించనేలేదు ప్రాచీనుడే మార్గదర్శకుడుగా తాను పెరిగాడు ఇంత కాలమూ తపస్సులోనే గడిచి పోయింది. అందుకే తాను తాత్కాలికంగానైనా ప్రాచీనుడ మాటను గౌరవించవలసి వచ్చింది ప్రాచీనుడు వివేకి, తనమాట ఇక చెల్లదని గుర్తించగానే ఒక ఆంతుపెట్టి, తాను తప్పుకున్నాడు ఇప్పుడు వసిష్ఠుడు ఎక్కడికైనా పోగలడు ఏమైనా చెయ్యగలడు. ఇదంతా వసిష్ఠుని ముఖంలో కనిపిస్తున్నది. అతనికి సంతోషం కలిగింది వెంటనే దానికి నీడగా విచారం తోడయింది ఊగులాడుతున్న మనస్సునుంచి ఇప్పుడు అతని ముఖంమీద వెలుగు నీడలు పడుతున్నాయి )

వసిష్ఠుడు

ప్రాచీన ధర్మాంకంచె ఈ యిసుక కొంత మెత్తనిది దీనిని అరుంధతి అన్నంగా వండజాలదా?

మాతంగకన్య తేజశ్శాలిని ఎందుకు కాగూడదు? మానవకల్పితకులానికీ, ఆధ్యాత్మిక మహాశక్తికీ ముడిపెడుతున్న ఈ ప్రాచీన మతం ఎంత సత్యదూరం?

అరుంధతి తపస్విని, బ్రహ్మావిదుషి, తప్పక ఈ యిసుకను వండగలదు నా అదృష్టం పండగలదు. నేను తక్షణం అరుంధతీ ఆశ్రమానికిపోయి దీన్ని వండిస్తా. (ఉత్సాహంగా ముందుకు అడుగులు వేస్తాడు. హఠాత్తుగా ఆగుతాడు. ముఖం గంభీరం అవుతుంది) ఎక్కడికి పోతున్నాను? ఎందుకు పోతున్నాను? ప్రేమించి మోసంచేసిన నావంక ఆమె కన్నెత్తి అయినా చూస్తుందా? అవమానాగ్నిలో దహించుకుపోతున్న ఆమెకు వడగాడ్పు కాబోతున్నానా?

ప్రేమకు పరీక్షా? ఒక వేళ ఈ ఇసుకను అరుంధతి వండ జాలకపోతే, ఆమెను నేను విడిచిపెట్టుకోగలనా? వండగల మరోస్త్రీని పెండ్లాడగలనా! అది సాధ్యమా?

నాకు కావలసింది అరుంధతిగాని, స్త్రీకాదే! ప్రేమను పరీక్షింపబూనుకొనేవాని హృదయం ఊషరక్షేత్రం. నాకు ఈ యిసుకతో పనిలేదు (*ఇసుకను పారవేస్తాడు*)

ఇంత పాపబుద్ధిగల నాముఖాన్ని ఇక అరుంధతికి చూపించలేను కర్తవ్యం-అయోమయం, గమ్యం-అంధకారం!
(*వెనక్కి తిరిగి వడి వడిగా నడిచిపోతాడు*)

## నవమ రంగం

(వేదవనంలో ఒక భాగం ద్వితీయాంకములోని ప్రథమ రంగాన్ని పోలివుంటుంది. కాని అప్పటి పచ్చదనం, నిండు, ప్రకృతిలో ఇప్పుడు లేదు చెట్లమీద ఆకులులేవు. తీగలు వాడి పోతున్నాయి దూరంలో ఎక్కడో శకుంత కలకలారవం వినిపిస్తున్నదిగాని, ఈ ప్రాంతంలో చూడడానికి ఒక్క పిట్టకూడ లేదు ఏవో నోటికివచ్చిన శ్లోకాలను వల్లించుకొంటూ కులగిరి ప్రవేశిస్తాడు అతడు చాల అలసివున్నాడు నిరాశ అతని ముఖంనిండా చిక్కగీతలు గీసినట్టుంది )

కులగిరి

నే నెలాగా ౹రిషిని కాలేను. కనీసం పండితుణ్ణయినా అవాలని తంటాలుపడుతున్నాను "శతశ్లోకేన పండితః"

వసిష్ఠుడు లేకపోవడంవల్ల, ఆశ్రమం దీపం తీసేసిన గదిలా వుంది ఎక్కడికిపోయాడో పాపం! ఎక్కడికి పోయినా పదివేల శిష్యుల్ని పెట్టుకోగల సమర్ధుడు

వాళ్ళు ఎంత అందగత్తెలు! అగ్గి నిప్పులు! వాళ్ళచేత ప్రేమించబడ్డ వసిష్ఠుడే - ధన్యుడు! మ్యాదిగలై తే అయ్యారు- ప్రేళ్ళాడవోయ్, మిత్రమా! "స్త్రీరత్నం దుష్కులాదపి" న్నేను నీకు శిష్యిరకం చేస్తాను

(*ఇటూ, అటూ పరికించి*) ఎంతదూరం వచ్చాను! ఈ చెట్లని ఒక్క పండైనా కనిపించదే! పిందెలు ఇలా రాలి

పోతున్నాయేమో ? చిగుళ్ళు మాడిపోయాయి! వ్యాపిక లింకిపోతున్నాయి! నిత్యవసంతంగా వుండే మా యాశ్రమా రణ్యం ఇలా ఎండిపోయిందేం ? వసిష్ఠుడు గీని శపించి పోలేదు గద! అతడి ఉసురు ఇలా దెయ్యమై తినేస్తున్నదేమో ?

ఇక మాకు తిండి ఎలా ? (*ఎదరకు చూచి*) చివరి కంటా వచ్చేశాను. అదెవరిదో కొత్త ఆశ్రమం అక్కడ కొంచెం పచ్చగానే వున్నట్టుందే! వెళితే! దురాక్రమణ అవుద్ది.

'ఆహారే వ్యవహారే చ త్యక్త లజ్జా సుఖీ భవేత్' ఏమైనాసరే - నేనింత ఆహారం పట్టుకుపోకపోతే, నా పనీ, మా గురువుగారి పనీ సున్నే (ముందుకు వెళతాడు, హఠాత్తుగా ఆగుతాడు. అవతలినుంచి ఎవరో ఆటంకపరిచారు)

తెరలో

ఎవడ్రా వాడు ?

కులగిరి

(*అదిరిపడి*) ఆఁ! నేను

తెరలో

నా పవిత్రాశ్రమ భూమిలో అడుగు పెట్టిన పాపీ! పేరు లేదా నీకు ?

కులగిరి

కులగిరిని, మహర్షి చంద్రమా! కులగిరిని!

తెరలో

ఓహో! కులగిరులా? ఆహా! ఏమి నా భాగ్యం! (శివోహం ప్రవేశిస్తూ) జగదాధారా! వైకుంఠరూపా! శరణు శరణు (సాష్టాంగపడతాడు)

కులగిరి

(మొదట తబ్బిబ్బయి, తర్వాత తెల్లబోయి) ఒరి, స్నీవట్రా! (వెనక్కిపోతూ) మ్ముట్టుకుంటున్నావ్!

శివోహం

(లేవకుండానే) మహాప్రభో! తమకు కూడా కులభేదాలు, అంటుదోషాలు, మడీ, మైలా, మాయా, మంత్రం వగైరా వున్నాయా, స్వామీ?

కులగిరి

(కలతతో) ఒరి, న్నేను పర్వతం కాదురా! నాకాళ్ళు వదల్రా!

శివోహం

కాదు, తమరు కులపర్వతమేనండి, బాబూ, నాదగ్గర అబద్ధ మెందుకాడతారు?

కులగిరి

నేను ప్రాచీనులవారి శిష్యుణ్ణిరా!

శివోహం

కాదు, నాకు వరం ఇస్తేనే గాని వదల్ను

కులగిరి

(తలబాదుకొంటూ) ఓరి భగవంతుడా!

శివోహం

తిరిగి నన్నే భగవంతుడంటున్నారా, స్వామీ? (తలెత్తి చూచి, లేస్తూ) ఓరి, నువ్వట్రా!

కులగిరి

(నిట్టూర్పుతో) ఆరి, నీదుంపతెగా!

శివోహం

ఓరి నీకొంప కూలా!

కులగిరి

మాటకు మాటా?

శివోహం

చేతకు చేతా.

కులగిరి

పోనీ—రాజీ పడదాం

శివోహం

కాదు—ప్రేమించుకొందాం

కులగిరి

ప్రేమ!! ఎక్కడా ఇదే గొడవలాగుందే!

శివోహం

మనిషికీ మనిషికీ మధ్య ప్రేమకంటె ఉత్కృష్టమైన సంబంధం మరి లేదట.

కులగిరి

ఎవరు చెప్పారు ?

శివోహం

మా పెద్దక్క ప్రేమకోసం తపస్సు చేస్తున్నది హృదయ పరిపక్వానికి, జీవిత సాఫల్యానికి తపస్సే సాధనమట

కులగిరి

ఓహో !

శివోహం

ఆమె తపస్సుకు సానుభూతిగా నేను ఇక్కడ తపస్సు చేస్తున్నాను !

కులగిరి

స్సానుభూతి తపస్సా ?

శివోహం

ఇది ముదిరితే మామూలు తపస్సే కాదటోయ్ ? మా తాతగారిలాగా, నేను కూడా ఒక మహాఋషినై పోతాను

(దూరంలో "ఒరే, శివోహం" అనే పిలుపు వినిపిస్తుంది. అటుచూచి కులగిరి ఉలిక్కి పడతాడు )

కులగిరి

అమ్మో ! ఆవిడ వచ్చేస్తోంది (*వెనక్కు తిరిగి పారిపోతాడు.*)

సంధ్య

(*ప్రవేశిస్తూ—అటుకేసి చూచి*) ఒరే ! ఆ పోతున్న వారెవరు ?

శివోహం

వాడా? వాడొక మనిషి!

సంధ్య

తిన్నగా చెప్పరా, గిప్పకాయ!

శివోహం

(కోపంగా)మరి—మనిషిని మని షనకపోతే మరే మనాలి?

సంధ్య

అతని పేరు?

శివోహం

కులగిరట.

సంధ్య

(జ్ఞాపకం తెచ్చుకొని) అయితే, నీవు త్వరగా పోయి అతణ్ణి పిలు!

శివోహం

ఎందుకు?

సంధ్య

వసిష్ఠుల విషయం కనుక్కోవాలి.

శివోహం

ఎందుకు?

సంధ్య

తర్వాతచెపుతా ముందు పరిగెత్తు! అతడు దూరం వెళ్ళిపోతాడు.

శివోహం

ఈ వ్యవహారం నాకిష్టంలేదు.

సంధ్య

ఏ వ్యవహారం ?

శివోహం

ఈ వర్ణాంతర ప్రేమవ్యవహారం. ఆపాటి కుర్రవాడు మన మునిపల్లెలో దొరకడా ?

సంధ్య

పడిశావు ముందువెళ్ళిరా, తర్వాత చెపుతాను (శివోహం మూతి ముడుచుకొని పరుగెడతాడు, సంధ్య అలానే చూస్తూ నిలబడుతుంది )

సంధ్య

ఆహా ! ఎంతకాలం ఈ ఘోరతపస్సు ! వేదబాహ్యం, ధర్మనిషిద్ధం, అభారతీయం, ప్రకృతివిరుద్ధం అయిన ఈ వర్ణభేద కాలుష్యాన్ని నీ తపోవహ్ని దహించగలదా, అక్కా ?

పాషాణాలనే కరిగించగల నీ ప్రేమాగ్నిజ్వాల వసిష్ఠుని నవనీత హృదయాన్నే కరిగించలేక పోతున్నదే ! లోకం భస్మమైనా, అతని లలాట భస్మరేఖ చెదరజాలదు వ్యక్తిదోషానికి సంఘశిక్ష ! ఈ విపత్తు ఎలా పర్యవశిస్తుందో ! వసిష్ఠునిజాడే కనిపించడంలేదు !

(కొంచెం ముందుకు నడుస్తుంది. దూరంలో ప్రజలకోలాహలం వినిపిస్తుంది. సంధ్య అటు పారజూస్తుంది కోలాహలం

సమీపిస్తుంది తండోప తండాలుగా ప్రజలు తరలి పోతున్నారు. మహావిపత్తు ఏదో వారిని తరుముకు పోతున్నది పేటలకు పేటలే, ఆశ్రమాలకు ఆశ్రమాలే ఖాళీ అయిపోతున్నాయి ఈ అపూర్వదృశ్యాన్ని చూస్తూ సంధ్య నిలబడిపోయింది అందులో ఒకజట్టు ఆమెను సమీపించింది భీతావహులై, అన్నార్తులై సాగి పోతున్న ప్రజలు - గోష్పాదం, కుంభోదరం మొదలైనవారు, హడావుడిగా రంగంలో ప్రవేశించారు )

గోష్పాదం

పదండి! పదండి!

కుంభోదరం

పరిగెత్తండి! పరిగెత్తండి!

సంధ్య

మహర్షులారా? ఎక్కడికీ పరుగులు? ఏ మహావిపత్తు మిమ్మల్ని తరుముకొస్తున్నది?

ప్రజలు

ఆకలి! ఆకలి!

గోష్పాదం

సాగండి ముందుకు!

సంధ్య

అయ్యో! ఏమిటా ఉపద్రవం?

కుంభోదరం

ఉపద్రవం - మహోపద్రవం!

గోష్పాదం

ఘోరం - ప్రళయం

ప్రజలు

కరువమ్మా! కరువు!

కుంభోదరం

ఘోరకరువు! లోకకరువు!

గోష్పాదం

జనమంతా చచ్చిపోతున్నారు

సంధ్య

అయితే - ఎక్కడికీ పరుగులు?

గోష్పాదం

బ్రహ్మ దగ్గరకు

కుంభోదరం

విష్ణుదగ్గరకు.

ప్రజలు

ఈశ్వరుడి దగ్గరకు ఎక్కడికిబడితే అక్కడికే కూడు దొరికే చోటికి. ఆకలితీర్చే వాకిలికి.

గోష్పాదం

ప్రజల దుస్థితి బ్రహ్మదేవుడితో చెప్పుకోవాలి

కుంభోదరం

అన్నం పెట్టలేనివాడు ఇంతమందిని ఎందుకు సృష్టించాడో-నిలవదీసి అడగాలి

(ప్రజలలో కొందరు "ఆకలి—ఆకలి" అంటుంటే మరి కొందరు "అన్నం—అన్నం" అని నినాదాలు చేస్తారు)

గోష్పాదం

నీవు కూడ బైలుదేరు.

కుంభోదరం

లేకపోతే చచ్చిపోతావు.

సంధ్య

మీతో నేను పరిగెత్తలేను.

గోష్పాదం

నా భుజాలమీద ఎక్కు?

కుంభోదరం

నానెత్తిమీద కూర్చో! శివుడు గంగను మోసినట్లు మోస్తా

గోష్పాదం

వీడి పొట్టే వీడు మోసుకోలేడు, ఇంకోర్ని మోస్తాడట!

కుంభోదరం

(కోపంతో) చూడు నా సత్తా (గోష్పాదాన్ని తన్ని నేలబడవేస్తాడు అతడు కుంభోదరాన్ని బోర్లబడనెట్టుతాడు. వాళ్లిద్దరూ కుస్తీ పడుతుంటారు)

ప్రజలు

శంభో! ఆకలి! ఆకలి!

సంధ్య

ప్రజలారా! ఈ నీచనాయకత్వం మీ కెందుకు? మా ఆశ్రమానికి రండి! మాకు కలిగిందే మీకు పెడతాం.

ప్రజలు

(అందరూ చేతులెత్తి నమస్కరిస్తూ) తల్లీ! అన్నపూర్ణా!

సంధ్య

(ముందుకు నడుస్తూ) రండి!

ప్రజలలో ఒకడు

మరి, మా నాయకుడు?

మరొకడు

చావనివ్వండి వాళ్ళు మనది తినే వాళ్ళేగాని, మనకు పెట్టేవాళ్ళు కారు

ఇంకొకడు

మనది తినడమేకాదు, మనల్నే తినేస్తారు.

సంధ్య

ఈ కరువు కాటకాలకు కారణం ఇలాంటి పాపులే (అందరూ నిష్క్రమిస్తారు గోష్పాదం, కుంభోదరం ఒక మూల ఇంకా కుస్తీ పడుతూనే వున్నారు. తమను విడిచి అందరూ వెళ్ళిపోవడం చూచి, పోరాటం ఆపి నిలబడ్డారు)

గోష్పాదం

ఒరేఁయ్! వాళ్ళు చెక్కేసినట్టున్నార్రా!

కుంభోదరం

పరిగెత్తరా, పట్టుకుందాం!

(ఇద్దరూ రెండోవైపుకు పరిగెత్తబోతారు అంతలో ఎదురుగా ఇద్దరు వృద్ధమునులు ఒక కుక్కను మోసుకొంటూ వస్తారు కుక్క మొర్రోమంటూ వుంటుంది గోష్పాదం, కుంభోదరం బలేకుక్క అన్నట్టుగా ఒకరికొకరు కనుసైగ చేసు కొంటారు మునులను సమీపిస్తారు)

గోష్పాదం

కుక్క ఎందుకు? మహామునీ?

ఒకముని

తినడానికి, స్వామీ!

కుంభోదరం

కుక్కను తింటారా, ఋషివర్యా?

రెండోముని

అసలు, కుక్కలుమాత్రం దొరుకు తున్నాయటయ్యా!

గోష్పాదం

(అసహ్యం నటిస్తూ) ఛె! తుఫ్!

కుంభోదరం

(మరీ ఘోరంగా) ఓఖ్! ఓఖ్!

గోష్పాదం

ఆ యెదరన్నీ కుందేళ్ళనే!

కుంభోదరం

మామిడిచెట్లు విరగబండి వున్నాయిగా?

మొదటిముని

ఎక్కడ స్వామీ ?

రెండోముని

నిజమా ? మహాత్మా ?

కుంభోదరం

మమ్మల్ని చూడరాదటయ్యా ? ఇప్పుడే బాగా గొంతు దాకా మెక్కి, అరక్క, కుస్తీ పడుతున్నాం.

గోష్పాదం

వెధవకుక్కని పారేసి, త్వరగా వెళ్ళండయ్యా ! ఇప్పుడే కొందరు ప్రజలుకూడ వెళ్ళారు.

మొదటిముని

దేవుళ్ళలా కనిపించారు, స్వామీ ! (కుక్కను పారవేసి, ఆశతో ముందుకు పోతారు. వాళ్లుపోగానే, వీళ్ళిద్దరూ కుక్కను ఎత్తుకుంటారు )

గోష్పాదం

బలేకుక్కరా ! రెండురోజులకు సరిపోతుంది.

కుంభోదరం

నాకైతే ఒక్కపూటకు కూడ చాలదు

గోష్పాదం

నేను తిన్నంతే నీవూ తినాలి తెలుసా ?

కుంభోదరం

దుమ్మూ, దుట్రా నాకు పడ వేద్దువుగాని లేరా.
(ఇద్దరూ కుక్కను మోసుకుపోతారు)

## దశమరంగం

(ప్రాచీనుడి ఆశ్రమం. అంతా కళాహీనంగా వుంది ప్రాచీనుడు తపస్సు చేసుకొంటూ అనేకసార్లు కళ్ళు తెరిచి చూశాడు అతడిమనస్సు నిలవడంలేదని ముఖమే చెపుతున్నది. కొంచెంసేపు అలానే కూర్చుని, కళ్ళు గట్టిగా మూసుకోడానికి ప్రయత్నంచేసి, లాభంలేక లేచినిలబడతాడు ఇటూ, అటూ పచార్లు సాగిస్తాడు)

ప్రాచీనుడు

వసిష్ఠుడు ఆశ్రమాన్ని విడిచింది మొదలు ఈ అరిష్టం దాపురించింది! ఆహా! ఎంతటి ఘోరక్షామం! ఎన్నియాతనలు! ఎంత జనక్షయం!!

ఏ ధర్మగ్లాని, ఏ సాధుహింస, ఏ పతివ్రతాశాపాగ్ని ఈ ప్రళయాన్ని తెచ్చిపెట్టిందో! ఈ జగన్నాశనాన్ని అరికట్టడం ఎలాగో!

శ్రీ మహావిష్ణువు దగ్గరకు రాయబారం వెళ్ళిన మహర్షి లింకా రానేలేదు. అత డేమన్నాడో!

(అంతలో నీరసంగా, కాళ్ళీడ్చుకొంటూ కులగిరి ప్రవేశిస్తాడు, ప్రాచీనుడికి సాష్టాంగపడి లేస్తాడు)

ప్రాచీనుడు

ఏమిరా, శిష్యా! విష్ణుదేవు డేమన్నాడు? ఈ కాట కానికి కారణమేమిటన్నాడు? దానికి పరిష్కార మేమి చెప్పాడు?

కులగిరి

గురువర్యా! అబ్బబ్బా! ఏమివైకుంఠ మండీ! వైకుంఠ మంటే ఇక్కడా, అక్కడానా? ఎంతదూరం, ఎంతదూరం! మీ్మరైతే మధ్య దారిలోనే వైకుంఠయాత్ర చ్చేద్దురు

ప్రాచీనుడు

నీ వైకుంఠయాత్ర గురించి చెప్పరా ముందు!

కులగిరి

ఎంత వైభవోపేతంగా వుందండీ ఆ ప్పట్నం! బ్భోగం అంతా అక్కడే వుందండి. ధాన్యం, ధనం, చీని చ్చీనాంబరాలు అక్కడ ప్పర్వతాల్లా పడివున్నాయంటే న్నమ్మండి. ఇక— అప్సరస లంటారా? (*గుటకలు మింగుతూ*) చ్చంద్రశకలాలు— అమ్మృతబ్బిందువులు!!

ప్రాచీనుడు

(విసుగ్గా) అబ్బబ్బా!

కులగిరి

అక్కడివాళ్లు ఒక్కపూట ఫలహారం మానేస్తే ఇక్కడ మనకు ప్పది సంవత్సరాలకరువు తీరిపోద్దండి.

ప్రాచీనుడు

(కోపంతో) ఇంతకీ, విష్ణుదేవు డేమన్నాడు ? ఈ విపత్తు దాటిస్తానన్నాడా ?

కులగిరి

చిత్తం తనకు చేతకాదన్నాడండి!

ప్రాచీనుడు

ఆఁ! ఆఁ! జగత్పోషకుడైన శ్రీ మహావిష్ణువే చేత కాదన్నాడా ?

కులగిరి

మొదట మేం బ్రహ్మగారిదగ్గర కెళ్ళాం "మనుష్యులందర్నీ సమానంగా సృష్టిస్తున్నాను మీలో మీరు భేదాలు పెట్టుకొని ఒకళ్ళ నొకళ్ళు హింసించుకొంటున్నారు. ఆ పాపం పెరిగి ఇలాంటి విపత్తులు దాపురిస్తున్నాయి నేనేమీ చెయ్యలేనిప్పుడు. మీరుపోయి విష్ణువు నాశ్రయించండి. పొండి" అని బ్రహ్మ దేవుడు సెలవిచ్చాడు

ప్రాచీనుడు

అతడేమీ చెయ్యలేడన్న సంగతి నాకు ముందే తెలుసు. అతగాడికి ఆ ఒక్కపనీతప్ప మరేమీ చేతకాదు.

కులగిరి

చిత్తం ఆ బ్రహ్మగారి పట్నంకూడా చూడవలసిందేనండి. అదొక చిత్రశాల! రకరకాల బొమ్మలు వేలు, లక్షలు ఆయన గారు చేసి పారేస్తుంటే, ఆవిడగారు రంగులు పూసేస్తూ -

ఊపిరి పోసేస్తూ వుంటుంది! మనందరి నమూనాలూ అక్కడ వున్నాయండీ - నే చూశాను! నా బొమ్మను ఎర్రమట్టితో చేశారు. నక్షత్రాలను సానబట్టిన కాంతిరజంతో చేశారండి ఒక ఆడబొమ్మను! ఆ ముఖలక్షణాలను నే నెక్కడో చూసిన గుర్తు! (ప్రాచీనుడు చేసేదిలేక నిట్టూర్పు విడిచి వూరు కుంటాడు)

కులగిరి

అక్కడినుంచి ద్దేవుడా అంటూ వైకుంఠానికి పోయాం ఆయనగారు అంతఃపురం వ్విడిచి బైటకి రావడమే మహా ఘనమై పోయింది.

ప్రాచీనుడు

శ్రీ మహాలక్ష్మి లేదా?

కులగిరి

ఎవరో చెంచులక్ష్మట! అసలు ఆయనగార్ని ఓ పట్టాన బైటికి వదిలితేనా? (కొంచెం ఆగి) "అరుంధతి అనే కన్యా రత్నం ఘోర తపస్సు చేస్తున్నది. మ్మీరు పరమశివుణ్ణి ఆశ్ర యించండి శుభం కలుగుతుంది" అన్నారాయన,

ప్రాచీనుడు

(నిశ్చేష్టుడై) అన్నన్నా!

కులగిరి

అక్కడినుంచి స్మశ్శీ పరమేశ్వరా అంటూ - ఆ కొండ లన్నీ ఎక్కి, కైలాసానికి వ్వెళ్ళేటప్పటికి మా పెద్దలు దిగి

వచ్చారు! (పెద్ద నిట్టూర్పు విడుస్తాడు) గ్గురువర్యా! ఈ దేవు ళ్ళకు ఎక్కడా చోటులేనట్టు ఆ కొండల్లో కట్టుకొన్నారేమండి ప్పట్టణాలు?

ప్రాచీనుడు

ఆ ప్రశ్న మనం అడగకూడదు

కులగిరి

న్నాకు తెలుసండి ఆ పర్వతాల సౌందర్యానికి సమ్మో హితులై అక్కడ చేరారు, ల్లేకపోతే - ప్రజలకు దగ్గర్లోవుంటే లోకువై పోతామని భయపడైనా అక్కడ చేరివుండాలి

ప్రాచీనుడు

దైవదూషణ పాపంరా! నోరుమూసుకో!

కులగిరి

చ్చిత్తం (నోరు మూసుకుంటాడు)

ప్రాచీనుడు

ఓరీ మందబుద్ధీ! సాంబశివుడేమన్నాడు?

కులగిరి

ఆయన అక్కడ ల్లేడండి.

ప్రాచీనుడు

(పెద్ద నిట్టూర్పు విడుస్తాడు) కైలాసములోనే లేడా?

కులగిరి

అంతకుముందే అరుంధతీ ఆశ్రమానికి బైలుదేరాడట! అక్కణ్ణించి చ్చచ్చినట్టు కొండదిగి, మ్మళ్లీ పరిగెత్తాం

ప్రాచీనుడు

ఎక్కడ దొరికాడు?

కులగిరి

ఇంకా దొరకలేదండి.

ప్రాచీనుడు

(నిరాశతో) పరమేశ్వరా! ఇప్పుడేమిటి కర్తవ్యం!

కులగిరి

ఇప్పుడక్కడికి వ్వెళతామండి కాని, అక్కడికి ఎలా వ్వెళ్ళడమా అని—

ప్రాచీనుడు

అదే ఆలోచిస్తున్నాను

కులగిరి

ప్పరమేశ్వరుడి కోసం వెళుతున్నాం కాబట్టి, ఆకాస్త సేపు—

ప్రాచీనుడు

కావచ్చు అతడెక్కడుంటే అక్కడికి వెళ్ళడంలో తప్పుంటగూడదు

కులగిరి

ఆ విధంగా కొన్నిసూత్రాలు ముందే రాసిపారేయండి.

ప్రాచీనుడు

(ఆలోచిస్తూ) పద ఆ సరస్సువరకు నేనుకూడ వస్తాను. (ముందుకు సాగుతారు. రంగంమీద కాంతిరంగులు మార

తాయి. వెలుగునీడలు దూరమవుతాయి. హఠాత్తుగా ఒక చోట ఆగుతారు పొదల అవతలినుంచి ప్రశ్న వినిపిస్తుంది.)

తెరలో

ఆగండయ్యా, ఆగండి! మహాజోరుగా వచ్చేస్తున్నారు!

కులగిరి

(అదిరిపడి) శ్శివ—శ్శివో—

ప్రాచీనుడు

(సంభ్రమంతో) ఆఁ! శివుడా? శివుడే! ఓ సాంబశివా! ఆపద్బాంధవా!

కులగిరి

(వారిస్తూ) క్కాదండి గురువుగారూ! వ్వాడండి, వ్వాడు, శ్శివోహంగాడండి!

ప్రాచీనుడు

(కోపంగా) అంటే?

కులగిరి

అరుంధతి త్తమ్ముడండి!

శివోహం

(ప్రవేశిస్తూ) ఎవరు మీరు?

కులగిరి

(ముందుకువచ్చి) మేం రా, మేం! నన్ను మరచి పోయావా యేం?

శివోహం

ఎవ్వరైనా సరే, ఈ ఆశ్రమంలో ప్రవేశించగూడదు.

కులగిరి

ఒక్కసారి కేరా !

శివోహం

లాభంలేదు మా పెద్దక్క తపస్సు చేస్తున్నది ఆమె ఏకాగ్రతకు భంగం కలగగూడదట !

ప్రాచీనుడు

అబ్బాయి, గట్టివాడవు మీఅక్క ధన్యురాలు ఆమెకు పరమేశ్వరుడే దర్శనమివ్వడానికి వస్తున్నాడు. నీవుకూడపోయి, ఆయన కృపను సంపాదించుకో !

కులగిరి

(*ఎదరకు చూపుతూ*) ఓహో ! మ్మంటలు ! మ్మంటలు !

ప్రాచీనుడు

(*చేతులు జోడించి*) ఓహో! అరుంధతి తపోమాహాత్మ్యం!

శివోహం

(*కంగారుగా*) ఓ ! మాయక్క కాలిపోతున్నది ! మీరు రాకండి సుమా ! (ఎదరమంటలు కనిపిస్తున్న వైపుకు పరిగెడ తాడు. కులగిరి, ప్రాచీనుడు నిశ్చేష్టులై అలానే నిలబడి వుంటారు. రంగం అదృశ్యమై పోతుంది )

## ఏకాదశరంగం

(అదే వనంలో మరో ప్రాంతం సరోవరతీరం ప్రకృతి అంతా ఏదో బెంగగా వున్నట్లు కనిపిస్తుంది వసిష్ఠుడు మెల్లగా,

నీరసంగా అడుగులు వేసుకొంటూ ప్రవేశిస్తాడు. అరుంధతిని గురించిన మనోవ్యథ కోటికైలాసాల బరువుతో అతణ్ణి అదిమి వేస్తున్నది ఆమె హృదయంతో ముడిపడ్డ అతని జీవనవల్లరి అతడు దూరంగా పోతున్న కొలదీ బిగువవుతున్నది అది తెగిపో తుందో - అతడు ఆగిపోతాడో!)

వసిష్ఠుడు

అరుంధతీ! నీ నుంచి నేను దూరంగా నడిచిపోతున్న కొలదీ నీకు నేను దగ్గరగాచేర వస్తున్నట్టుగా వుంది! ఇదే నిజమైతే ఎంత అదృష్టం! భూవలయంలో అట్టిది సాధ్యమా?

తలిరాకు కిటికీల దరిజేరి యేపుచూ
పులు మాటిమాటికి పలకరించు!
చూపులా అవి? కావు! సుఖముగా నా యాత్మ
సారసమ్మును చీల్చు షట్పదములు!
చెంగల్వమోవి చీల్చిన కావి లేనవ్వు
ఎండలుగాయు నా గుండెలోన!
గుండెకాదిది - హోమకుండము, పలుకొక్క
నేతిబొట్టుగ మండు నిప్పులందు!
నీరజాస్య నాకు నిత్యాగ్నిహోత్రమై
నమిలిమ్రింగసాగె నన్ను నన్ను!
ప్రణయ యజ్ఞమందు ప్రాణాలను యజించి
సోమపానమగుదు సుదతి పెదవి!

(ఒకలతా వేదికమీద కూర్చుంటాడు! హస్తముకుళం అగ్రాన్ని క్రిందిపెదవికి ఆనించి దీర్ఘాలోచనలో మునిగి పోతాడు అతని పంచప్రాణాలు పంచభూతాలలో చేరి పర మేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నట్టుగా వుంటుంది నిజంగానే పాట స్పష్టంగా వినిపిస్తుంది అది సంధ్యానివేదనగా, అరుంధతి ఆరా ధనగా తలంచబడవచ్చు లేక - లోకమే ఆరాటపడుతున్న దేమో!)

(తెరలో)

నీవే గతివి— నీవే పతివి—
నిఖిలావని కో దేవా!
కమ్మని తేనెకు, కరకుముల్లునకు
కాడవు నీవే నో దేవా!
జీవనపతి! నా జీవితగతిలో
పూవులు పుడికిన దీవేనా?
కరుణకు పట్టిన ధరణీ హస్తము
కరవున నింపుట తగవేనా?
ప్రణయమె మొలవని పాటినేలలో
ప్రణవకోకిల రవమా?
హేతువు తెలియని యాతనలో, నీ
వ్రాతకు శీతువె ఫలమా?

(వసిష్ఠుడు సావధానంగా విన్నాడు నిట్టూర్పు విడిచి లేచాడు)

వసిష్ఠుడు

తపస్సు చేశాను అదొక యెడారి ఒక నీటి చెలమ లభించింది. అది ఆ క్షణమే ప్రాచీన తీవ్ర వాతోద్ధూతమైన ఇసుకతో పూడిపోయింది ఈ జీవితంలో ఇక తపస్సులేదు తపస్సులేక జీవితమేలేదు నమ్మించి మోసంచేసిన నా ముఖం అరుంధతి చూడదు ఇక నాకు దిక్కు నీవే! ఓ మృత్యువా! నన్ను తీసుకుపోయి, నీ అనంత కాలగర్భంలో దాచేసుకో!

కులవిభేదంపు కఠినశృంఖలము ద్రెంచి
మోక్షముం బొందజాలని మూఢు నేను,
సత్త్వహీనుని బ్రతుకు వర్జ్యమ్ము, కాన
రమ్ము! మరణమ! కరుణకై కొమ్ము నన్ను!

(అదేసమయానికి పరమశివుడు ప్రవేశిస్తాడు. హాడావిడిగా ప్రయాణమై పోతున్నట్టు వుంటాడు అందువల్ల పాముల కండవాలు వగైరా ఏమీలేవు జుట్టుముడిలో చంద్రవంక జారిపోతూవుంది చేతిలో త్రిశూలంలేదు ఈ వేషంలో అతణ్ణి గుర్తుపట్టడం కొంచెం కష్టం అతడు వసిష్ఠునిచూచి ఆగాడు.)

పరమశివుడు

మరణమా? ఎవరికి బాబూ?

వసిష్ఠుడు

(తలెత్తిచూచి) నాకే! మహాశయా! నాకే! మరణం గురించి మీ కేమైనా తెలుసా? అది నా కెలా లభిస్తుంది?

పరమశివుడు

ఏ మరణం ?

వసిష్ఠుడు

(అప్రతిభుడై) ఏ మరణమా ? ఎన్ని మరణాలున్నాయి ?

పరమశివుడు

చాల వున్నాయి అందులో నీకు ఏమరణం కావాలి ?

వసిష్ఠుడు

వ్యర్థజీవికి తగినది ఏదైతే అది

పరమశివుడు

అయితే, అది దీర్ఘయాతనామయం, నీవు భరించలేవు అయినా, నీవు అంత కఠినవ్రతానికి ఎందుకు పూనుకొన్నావు ?

వసిష్ఠుడు

మరణించడం కఠినవ్రతమా ?

పరమశివుడు

వ్యర్థజీవిగా మరణించడం కఠినమే కాదు, క్రూరంకూడ. పురోగతి జీవి స్వభావం దాన్ని బలవంతంగా ఆపడం బహు బాధాయుతం

వసిష్ఠుడు

ఎవరు ఆపడం ?

పరమశివుడు

వ్యక్తి, సంఘం, పరిస్థితి. ఆంతరంగిక జాడ్యాన్ని నిర్మూలించుకొని, బాహ్యాబంధాలను త్రెంచుకొని, ముందుకు దూక

డమే చైతన్యలక్షణం, చైతన్యం మంచిపోటులోగల జాల యౌవనం నీది నీ పురోగతిని అడ్డగల దేది ? పోదాం పద !

వసిష్ఠుడు

ఎక్కడికి ?

పరమశివుడు

నీ వెక్కడికి పోతున్నావో అక్కడికి నేనుకూడ వస్తాను.

వసిష్ఠుడు

(నిరుత్సాహంగా) మీరా ? మీరు రాలేరు, స్వామీ ! మీరు రాలేరు. నాదారి నాదే అది మీకు అగమ్యం

పద పదమ్మున కంటకవ్రజము కసుకు
కసుకు దిగుచుండ, కోటికర్కశ కఠోర
నరకముల బాధతో నేను నడుచుచుంటి,
కరుణలేని నిశీథ మార్గమ్మునందు.

పరమశివుడు

అటువంటి కర్కశ కఠోరమార్గం నీ కెందుకు, నాకెందుకు ? నామార్గంలో పోదాం పద ! నామార్గం నిన్ను మహదానంద పదం చేర్చగలదు స్వాభావికమైన మా పార్వతేయ ప్రణయజీవనం సౌఖ్యానికి దోహదం కాగలదు మా నిలయం శాంతికి పూజాగృహం, కాంతికి రాచబాట. క్రాంతికి రంగస్థలం.

గజ చర్మంబులుగట్టి, పాము తలపా
గాల్ జుట్టి, భూమీధర

వ్రజముల్ మెట్టుచు, గంగగట్టులను వి
శ్రాంతిన్ బ్రవర్తిల్లుచున్,
రజనీకాంతుని నీడలన్ అమృత శృం
గారమ్ములన్ దేలు మా
సుజన స్నేహములో సుఖమ్ము గొనవ
చ్చున్, రమ్ము, మా వీటికిన్ !

(వసిష్ఠుని చేయిపట్టుకొని లాగుతాడు వసిష్ఠుడు పుల కిత దేహుడవుతాడు )

వసిష్ఠుడు

మహాత్మా! మీ స్పర్శ నాకేదో అపూర్వశక్తిని ప్రసాదించినట్టయింది! మీ రెవరో మహాసత్త్వ సంపన్నులైన లోకోత్తర పురుషులై వుండాలి. మీ అవ్యాజ వాత్సల్యానికి కృతజ్ఞుణ్ణి కాని -

మీరు హిమవన్నగోరు కాంతార కుసుమ
రుచులకోసము పుట్టిన ఋషులు, నిజము,
నాది చింతావిభిన్న భాండపు చరిత్ర
ఇంకిపోయిన దెవరును ఎత్తలేరు

నాదారిని నన్ను పోనివ్వండి.

పరమశివుడు

(ఆలోచన నటించి) బహుశా నీదొక భగ్న ప్రణయ చరిత్ర! ఈ తాపస కుమారుణ్ణి తాపజ్వాలలో పడద్రోసి పోయిన ఆ కరినాత్మురాలు ఎవరో!

వసిష్ఠుడు

ఆమె కాదు నేనే కరినాత్ముణ్ణి ఆమె మాధవీలత, నేను ఝుంఝా మారుతాన్ని జాత్యహంకారం, స్వామీ! నన్ను సర్వనాశనం చేసింది జాత్యహంకారం.

పరమశివుడు

జాత్యహంకారమా?

వసిష్ఠుడు

ఔను నేను ఆర్యజాతివాణ్ణి, అనార్య కన్యకను ప్రేమించాను

పరమశివుడు

(నవ్వి) ఓయి పిచ్చివాడా! భారతదేశంలో ఆర్య, అనార్యభేదం కలదా?

అలనాడు తొలి హిమ ప్రళయమ్మునకు ముందు
ఉత్తరధ్రువ భూము లుద్ధరించి,
ఆవెన్క, సైబీరియా యెడాయిలలోన
తిండి, బట్టయు లేక తిరిగి తిరిగి,
క్రమముగ, పారసీకపు నీటి పట్టుల
స్థిమితమ్ముగా కాపురములు పెట్టి,
చాలక, భరతదేశము జేరి, శాంతి సు
స్థిరతలు కనుగొన్న నరులలోన

భూరి సత్త్వులు ద్రవిడులు మొదటిజట్టు,
వెనుకవచ్చిన దార్యులు, వీరు వారు
అన్నదమ్ముల కలహాల దన్నుకొనిరి,
ఎవ్వరార్యులు, ద్రావిడులెవరు, నేడు?

ద్రావిడులు, ఆర్యులు ఒకేఒక జాతికి చెందినవారు, సోదరులు కారా? దితి, అదితుల సంతానంకారా? అదీగాక - పెరుగుదలలో పరిసరాల ప్రాబల్యం మినహాయిస్తే, మానవజాతి అంతా ఒక్కటేకాదా, బాలర్షీ?

వసిష్ఠుడు

(విచారంతో నిట్టూర్చి) అజ్ఞానం కుమార్గం కానిది, మహాత్మా! అజ్ఞానానికి మించిన పాపం మరిలేదుగదా!

పరమశివుడు

జ్ఞానసూర్యోదయంతో అజ్ఞానాంధకారం నశించిపోదా?

వసిష్ఠుడు

ఈ సాయంకాల సూర్యోదయం నిష్ఫలం, స్వామీ! ఈ జ్ఞానం ఆనాడే వుండివుంటే, ఆమె హృదయాన్ని అంత గాయ పరిచేవాణ్ణి కాదుగదా!

పరమశివుడు

ఇప్పుడు మించిపోయిందేమీ లేదు, కుమారా! అజ్ఞానంతో చేసినతప్పును జ్ఞానంతో దిద్దుకోవచ్చును.

వసిష్ఠుడు

చీకటిలో కొట్టినదెబ్బ వెలుగులో బాధపెట్టదా, స్వామీ?

పరమశివుడు

దానిని పశ్చాత్తాపంతో తుడిచివెయ్యవచ్చును. పొర పాటు చెయ్యడం మానవలక్షణమే. అది తెలిసిన తరువాత వెంటనే దిద్దుకోకపోవడం మాత్రం పశులక్షణం నీకోసం ఆమె ఎంత పరితపిస్తున్నదో కదా! పైగా, మహాతస్వీని, మాతంగ కన్య, అరుంధతి! సర్వార్య సరాధ్య కదా, బాబూ?

(వసిష్ఠునిలో సుడగాలి రేగింది అంతలో సంధ్య కంఠ స్వరంతో దూరంలో పాటవినిపిస్తుంది ఇద్దరూ సావధానంగా వింటారు)

తెరలో

కన్నుగప్పిన కాళరాత్రిని
తెన్నుదప్పిన తెరువరీ!
తెల్లవారినదోయి జగమున,
కల్లజారినదోయి నిజమున!
    ఆగి చూడుము, తెరువరీ!
    అడుగు త్రిప్పుము, తెరువరీ!
అమృత మనుకొని నిన్ను గ్రోలిన
ఆత్మ భగ్గున మండుచున్నది!
భస్మమందు లిఖించి, ఊదిన
ప్రణయగేయము వెతుకుచున్నది!
    రమ్ము వెనుకకు, తెరువరీ!
    రాచబాటిదె, తెరువరీ!

వసిష్ఠుడు

(తత్తరపాటుతో) ఓహో ! సంధ్యా ! ఏమైనసరే, ఇక నేను తడవుచెయ్యను. క్షణంలో వెళ్ళి, నేనామె క్షమాభిక్షను వేడుకొంటాను. స్వామీ ! తరువాత కలుసుకొందాం. (నిష్క్రమిస్తాడు.)

పరమశివుడు

(చిరునవ్వుతో అతడు వెళుతున్న దారివంకే చూస్తూ) వసిష్ఠా ! ధన్యుడవు !

సంధ్య

(వెనుకనుంచి ప్రవేశిస్తూ) అయ్యో ! స్వామీ ! మీరిక్కడున్నారా ? లోకమంతా మీకోసం వెతకలేక చస్తున్నది

పరమశివుడు

నీవిలా తిరుగుతున్నావేం—ఈ కొండల్లో ? అరుంధతి క్షేమమా ?

సంధ్య

పాపం ! ఏమీ తెలియనట్టు !

పరమశివుడు

నాకెలా తెలుస్తుంది ?

సంధ్య

సరే, కానివ్వండి ఇప్పుడు మనం మా ఆశ్రమానికి పోవాలి శీఘ్రంగా

పరమశివుడు

ఎందుకు ?

సంధ్య

పని వుంది.

(అంతలో గోష్పాదం, కుంభోదరం, కులగిరి, మరి కొందరు ప్రజలు వగుర్చుకొంటూ, పరుగుపరుగున అక్కడికి వస్తారు. ఆకలి - అన్నం అనే నినాదాలు మిన్ను ముట్టుతాయి. పరమశివుణ్ణి చూచి ఆగుతారు )

గోష్పాదం

ఈయనగారే శివుడై వుండాలి, ఆగండోయ్, ఆగండి !

కుంభోదరం

ఈయన అయి వుండడు, పదండ్రా ! పదండి !

గోష్పాదం

వెనుక సతీదేవిలా వుందిరా ! ఈయనే అని నా విశ్వాసం

కుంభోదరం

మరి, త్రిశూలమేదీ ? పాములేవీ ?

కులగిరి

మూాడోకన్ను అది కాదటోయ్ ? శ్శివుడే ! శ్శివుడే !

ప్రజలు

దేవా ! ఆకలి ! ఆకలి !

గోష్పాదం

ప్రభో ! అన్నంలేదు

కుంభోదరం

తినడానికి గడ్డికూడా లేదు

గోష్పాదం

కుక్కలు కూడా అయిపోయాయండోయ్!

కుంభోదరం

కొండలు కొరకబడ్డంలేదు

కులగిరి

స్వామీ! మ్ముందు నాకో కాయో, కసరో, ద్దయ చేద్దురా- మ్మీ పేరు చెప్పుకు బ్రతుకుతాను

పరమశివుడు

ప్రజలారా! ఈ కరువుకు, మీ కష్టాలకు నేను చాల విచారపడుతున్నాను.

గోష్పాదం

మీ విచారంతో మా కడుపులు నిండవు.

కుంభోదరం

తక్షణం మా కడుపుకింత ఏదో పెట్టకపోతే, మా జీవనా లుండవు.

గోష్పాదం

అన్నం సృష్టించండి!

కుంభోదరం

ఆలస్యం చెయ్యకండి!

పరమశివుడు

(కోపంతో) ఓరి, మూర్ఖులారా! భూమికి భారంగా ఇంతమంది ద్విపాదపశువుల్ని సృష్టించడం అసలు బ్రహ్మాదితప్పు. తిండిపెట్టలేని తప్పు విష్ణువుది స్థితినిబట్టి సృష్టి, సృష్టినిబట్టి స్థితి ఏర్పాటు చెయ్యాబడవలసివుంది ఆ రెంటికీ సమన్వయం కుదరని నాడు, నేను కలుగజేసుకుంటాను. వారిద్దరి తప్పుల్ని దిద్దే లయకారుణ్ణి నేను.

గోష్పాదం

(వణుకుతూ) చచ్చాంరా, కుంభోదరం!

కుంభోదరం

(మరీ వణుకుతూ) మూడోకన్ను తెరుస్తున్నాడ్రోయ్! గోష్పాదం!

ప్రజలు

దేవా! ఆకలి! ఆకలి!

సంధ్య

(ముందుకువచ్చి కేలుమోడ్చి) దేవా!

కులగిరి

(సంధ్యను గుర్తించి) అమ్మో! మ్యాదిగపిల్ల! మ్యాదిగ పిల్ల! ప్పరమేశ్వరా! మ్యాదిగపిల్లను ముట్టుకొంటున్నావ్! మైలపడిపోతావ్!

గోష్పాదం

తొలగండి! తొలగండి!

కుంభోదరం

తప్పుకోండి! తప్పుకోండి!

గోష్పాదం

ఆ మైలచేతులతో మా కేమిచ్చినా పుచ్చుకోం

కుంభోదరం

చస్తే చస్తాం

ప్రజలు

దేవా! ఆకలి! ఆకలి!

పరమశివుడు

(నిరాశతో) ఈసృష్టిని చేసినవాడు పిచ్చివాడై వుండాలి. ఎంతఅజ్ఞానం! ఎంతస్వార్థం! ఎంత పరస్పర ద్వేషం! ఈ నికృష్టజాతి నశిస్తేనేం?

సంధ్య

(అంజలిఘటించి) దేవా! చంద్రశేఖరా!
చీడపుర్వు పట్టిన దను కోపము
చెట్టుపైని చూపెదవా?
విషజీవులు నల్గురికై లోకము
విలయములో ముంచెదవా?
దేవా! జాలు!
దీనదయాళు!
కనుగొనుమా ఆ పేదల బాధలు
కన్నులు లోతుకు పోయి-

వినబడవా ఆర్తేవుల మోతలు
వెన్నున కంటుక పోయి ?

దేవా ! చాలు !
దీనదయాళు !

(మోకాళ్ళపై నిల్చి, పాదాభివాదం చేస్తుంది.)

పరమశివుడు

(సంధ్యను వారించి, అభయం ఇచ్చి, కొంచెంసేపు ఆగి) ప్రజలారా ! మీరెంతకాలం కులమతవర్గవిభేదాలతో అజ్ఞానులై ప్రవర్తిస్తారో అంతకాలం మీకీ అరిష్టాలు తప్పవు ఇక—ప్రస్తుతానికి మిమ్మల్ని ఈవిపత్తునుంచి రక్షించగలవా రొక్క పతివ్రతలు మాత్రమే మీరుపోయి పతివ్రతలను ఆశ్రయించండి. వారు మీకింత భిక్షపెట్టగలరు

గోష్పాదం

పదండి పదండి !

కుంభోదరం

పరిగెత్తండి ! పరిగెత్తండి !

ప్రజలు

ఆకలి ! ఆకలి ! (నిష్క్రమిస్తారు)

సంధ్య

పాపం—అమాయకు లెంతమంది యమయాతనలు పడుతున్నారు ! చాలమంది ప్రజలు మాఆశ్రమంలో తలదాచుకొంటున్నారు ఎందుకో మాఆశ్రమంలోకి ఈ కాటకం ప్రవేశించలేదు !

పరమశివుడు

కలిగినదానితో సంతృప్తిపడే కష్టజీవులను కరువు బాధించదు

సంధ్య

(ఎదరకుచూచి) స్వామీ! అతడే ప్రాచీనుడు! ఇలానే వస్తున్నాడు! ఆర్యధర్మం యావత్తూ అతని భుజస్కంధాల మీదనే నిలిచివున్నదని అతని ఊహ!

(అంతలో దీర్ఘాలోచనా పరతంత్రుడై ప్రాచీనుడు ప్రవేశిస్తాడు చాల నీరసంగా, నిరుత్సాహంగా వుంటాడు మెల్లిగా నడుస్తున్నాడు)

ప్రాచీనుడు

ఒక మాదిగపిల్ల తపస్సు చెయ్యడం! ఇటువంటి ఉత్పాతాలు సంభవించడం! ఎంత విపరీతంగా వుంది ఇక ఆర్యజాతి అడుక్కుతిన్నట్టే!

(కొంచెం నడిచి, అటు చూస్తాడు సంధ్యా, పరమశివులు కనిపిస్తారు ఆశ్చర్యపోతాడు అరుంధతీ వసిష్ఠులనుకుంటాడు. నెత్తి బాదుకుంటాడు)

అయ్యో! కర్మ! కర్మ! వసిష్ఠా! నా సలహాను తిరస్కరించి, చివరకు ఆ మాదిగపిల్లనే చేరావా? ఈ ధర్మగ్లాని- ఈ ఘోరకలి నేనిక చూడలేను- చూడలేను (తప్పుకొని పోతాడు)

పరమశివుడు

మునిపుంగవా! అభివాదాలు.

ప్రాచీనుడు

(ఆగి, పరీక్షగా చూచి) వసిష్ఠుడనుకొన్నాను! క్షమించాలి. తమర్ని ఇదివరలో చూచిన జ్ఞాపకం లేదు!

పరమశివుడు

నన్ను పరమశివుడంటారు

ప్రాచీనుడు

(కంగారుపడి) ఓహో! సతీ సాంబశివులారా! ఆది దంపతులారా! భక్తుడు నమస్కరిస్తున్నాడు

(నమస్కరిస్తాడు)

సంధ్య

నేను సతీదేవిని కానండోయ్! సంధ్యను. సంధ్యను

పరమశివుడు

మహర్షి! ఈమె అరుంధతి అక్కచెల్లెలు.

సంధ్య

వీరు మా తాతగారు

ప్రాచీనుడు

(ఆశ్చర్యంతో) ఆఁ! ఇదెక్కడి సంబంధం?

సంధ్య

ఆచార్య సంబంధం.

ప్రాచీనుడు

అరుంధతి మాతంగి కాదా?

సంధ్య

పరమేశ్వరుడు కూడ మాతంగుడే కాటిగాపరి.

పరమశివుడు

ఋషివ్యాఘ్రూ! మీరుకూడ అంతే.

ప్రాచీనుడు

(కోపంతో) నాతో వేళాకోళమా?

పరమశివుడు

కాదు- స్వామీ, కాదు నేనన్నది సత్యమే అధికారం కోసం ఆర్యద్రావిడుల మధ్య జరిగిన అనేక యుద్ధాల పర్యవసానంగా సమాజంలో హెచ్చుతగ్గు లేర్పడ్డాయి. వృత్తుల ననుసరించి వర్ణాలేర్పడ్డాయి. అవే కులాలైనాయి మతంగమహర్షి సంతానం మాల మాదిగలు. మతంగుడు ఆర్యద్రావిడ సమైక్యమూర్తి ఆర్యద్రావిడులు మూలార్యజాతి శాఖలు, అన్నదమ్ములు. ఈ భేదాలు తాత్కాలిక ప్రయోజనాల కోసం సంఘ సముద్రంలో పుడుతూ పోతూవుండే అలలవంటివని తెలిసికూడ, మీవంటి పెద్దలు వీటిని శాశ్వతంగా పాటించబూనడం శోచనీయం

ప్రాచీనుడు

(ఆలోచిస్తూ) ఈ సంగతి నాకు తెలియదే!

సంధ్య

మనప్రపంచజ్ఞానం మన ఆశ్రమానికే పరిమితం, స్వామీ!

ప్రాచీనుడు

అయితే, ఆర్య ద్రావిడు లొకేజాతి అంటారా?

పరమశివుడు

పూర్తిగా. కశ్యప సంతానం.

సంధ్య

పూర్వాచార్యులు, పుణ్యదేవులు మన ప్రాచీనులే, స్వామీ!

పరమశివుడు

(నవ్వుతూ) పైగా, ఆత్మజ్ఞానికి ఈ గందరగోళం అంతా దేనికి? మహర్షీ! ఈ అనంత విశ్వమానవ చరిత్రలో ఒక్క అక్షరం తలకట్టుకూడ కాజాలని మన అల్పజీవితాలకోసం ఇంత ఆర్భాటం ఎందుకు?

(ప్రాచీనుడు మాట్లాడడు దూరంలో ఆకాశం తేజోవంతం అవుతుంది అందరూ అటు కేసి చూస్తారు.)

ప్రాచీనుడు

(చేతులుమోడ్చి) అరుంధతి తపోమాహాత్మ్యం!

పరమశివుడు

పదండి, అక్కడికి వెళదాం

(సంధ్య ముందు నడుస్తుంది ఆ వెనుక పరమశివుడు, ప్రాచీనుడు నడుస్తారు వారివేగం హెచ్చేకొలది రంగంఅదృశ్యమై పోతూవుంటుంది )

## ద్వాదశ రంగం

(అరుంధతి ఆశ్రమం, ఎర్రటి కాంతితో రంగం ఉజ్వలంగా వుంది అరుంధతి నిలబడి తపస్సు చేస్తూవుంది ఆమె చేతిలో వసిష్ఠుని కమండలువు, జపమాల అలానే వున్నాయి. ఆమె శరీరంనుంచి తెల్లటిమంటలు పైకివస్తున్నాయి అవి మంటలో-

ఆమెను కాలకుండా రక్షిస్తున్న వెన్నెలవెలుగులో! ఆమెవదన బింబంనుంచి వెలువడుతున్న తేజస్సు స్వచ్ఛమైన శరన్మేఘంవలె ఆశాంత రాళాలకు వ్యాపిస్తూ వుంది ఇది అసలు మేఘాలను నిర్జించడంవల్ల కాబోలు అనావృష్టి ఏర్పడి, కరువుగా పర్యవసించింది శివోహం ఒకపాత్రతో నీళ్ళు తీసుకొని, ఏమీ తోచక కంగారుపడుతూ, అరుంధతి చుట్టూ తిరుగుతున్నాడు.)

శివోహం

అయ్యో! అక్కా! ఎలాగే ఇప్పుడు? ఎక్కడ పొయ్యను నీళ్ళు? ఎలా ఆరుతుందీ అగ్ని? ఇది మామూలు అగ్నా ఆర్పడానికి! (పాత్ర అక్కడ పెట్టేసి) తపోవహ్నా! ఎందుకొచ్చిన తపస్సే తల్లీ ఇది? ఇదంతా ఆ వసిష్ఠుడివల్ల వచ్చింది అతణ్ణి నమ్మావు మోసం చేశాడు మగవాణ్ణి నమ్మిన ఏ ఆడపిల్ల బాగుపడింది? కొరివితో నెత్తి గోక్కున్నావు. నెత్తంటుకొన్నది! మంటల్లేవు. మండపోతున్నావు! ఇప్పుడు నేనేం చెయ్యను?

వసిష్ఠుడు

(ఆందోళనగా ప్రవేశిస్తూ) అరుంధతీ! అరుంధతీ! ఆహా, ఏమి ఈ దివ్యజ్యోతి!

శివోహం

(అడ్డగించి) ఆగవయ్యా! ఆగు. ఇదంతా నీ చలవే! (భస్మం వాసన గుప్పున కొడుతుంది. శివోహం ముక్కు నలుపుకొంటాడు.)

వసిష్ఠుడు

అరుంధతీ! ప్రాణసఖీ! తపోవహ్నిలో భస్మమైపోతున్నావా? నీకన్న ముందు నేనే యోగవహ్నిలో చితాభస్మం అవుతున్నాను మనిద్దరిభస్మాలు కలిసే పరమేశ్వరారాధనలో విభూతిపుండ్రం అగుగాక!

(అరుంధతి సరసను నిలబడి యోగముద్ర ధరిస్తాడు అతని శరీరంలోనుంచి కూడ మంటలు బైలుదేరతాయి. భస్మం వాసన మళ్ళీ గుప్పుమంటుంది అంతలో పరమశివుడు, తక్కిన వారు త్వరితంగా ప్రవేశిస్తారు)

పరమశివుడు

వసిష్ఠా! ఆగు! ఈ మహాచరిత్ర విషాదాంతం కారాదు (కమండలువులోని తీర్థంతీసి, ఇద్దరిమీదా చల్లుతాడు)

అరుంధతి

(కన్నుతెరచి, ప్రక్కనున్న వసిష్ఠుణ్ణిచూచి) ఋషి కుమారా! పాదదాసి అభివాదం చేస్తున్నది

వసిష్ఠుడు

(కన్నుతెరచి) ఓహో! ప్రియా! ఎంత అదృష్టవంతుణ్ణి!

అరుంధతి

(పరమశివునిచూచి, భక్త్యావేశంతో) దేవా! భక్తురాలు నమస్కరిస్తున్నది.

పరమశివుడు

కల్యాణమస్తు.

అరుంధతి

(ప్రాచీనుడితో) మునికులావతంసా! వందనాలు స్వీకరించి, ఆశీర్వదించండి!

ప్రాచీనుడు

పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు!

వసిష్ఠుడు

ప్రాచీనా! నన్ను క్షమించు

ప్రాచీనుడు

అరుంధతి కిచ్చిన దీవెనే నీకు ఇస్తున్నాను వసిష్ఠా! పరమశివుని అనుగ్రహంతో నేను జ్ఞానినైనాను ఇప్పుడు మీరిద్దరూ భస్మంనుంచి పునరుద్భవించిన దివ్యమూర్తులు. మీకు ఇహపరాలు రెండూకూడ నిత్యకల్యాణం, పచ్చతోరణం అగుగాక మహేశ్వరా! ఇక నాకు సెలవిండు. (నిష్క్రమిస్తాడు).

వసిష్ఠుడు

(ఆశ్చర్యంతో) మహేశ్వరా! మీరేనా? మహా విపత్తునుంచి నన్ను రక్షించిన మీకు సర్వదా కృతజ్ఞుణ్ణి! (పాదాభివాదంచేస్తాడు.)

పరమశివుడు

(వసిష్ఠుణ్ణి లేవదీసి) కుమారా! ఏదైన వరం కోరుకో!

వసిష్ఠుడు

(ఆనందంతో) దేవా! అరుంధతిని నాకు అగ్నిసాక్షిగా ధయచెయ్యండి!

పరమశివుడు

అమ్మా! (అరుంధతి దగ్గరకు వస్తుంది.)

సంధ్య

మేము మాదిగలం కదా!

వసిష్ఠుడు

శక్తిరూపిణులారా! నన్ను క్షమించండి! (పరమశివుడు అరుంధతిచేతిని, వసిష్ఠుడిచేతిని తన చేతిలోకి తీసుకుని, సంధ్య వంక చూస్తాడు)

సంధ్య

మంగళం భవతి!

పరమశివుడు

అరుంధతీ! వసిష్ఠా!

పూవులతేనె, లితురస
ముల్, ఫలశీధువు, లిష్టకోకిలా
రావము, లారు కాలముల
రాగముతో జలకమ్ములార్చి, మీ
సేవలు చేయుచుండ - విర
జిమ్ముడు విశ్వజనాంతరంగ రా
జీవములందు ప్రేమసుఖ
జీవనవోదయ భాగధేయముల్.

(ఇద్దరి చేతులూ కలుపుతాడు రంగంనిండా చంద్ర కాంతి వికసిస్తుంది శుకపిక శారికా కోటికంఠాలతో వనలక్ష్మి

కల్యాణగీతాలు పాడుతుంది నందన పారిజాతాలు వర్షిస్తాయి. అమృతం పన్నీటి జల్లువలె కురుస్తుంది ఆ సమయంలో ఆకలి నినాదాలు వినిపిస్తాయి. కొనవూపిరితో- కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకొని కాళ్లీడ్చుకొంటూ, కుంభోదరం. గోష్పాదం, కులగిరి, ప్రజలు ప్రవేశిస్తారు )

గోష్పాదం

దేవా! చచ్చాం. చచ్చాం!

కులగిరి

పరమేశ్వరా! ఇక కదల్లేం

(అంతా కూలబడతారు)

పరమశివుడు

ఓయీ! మీ కెక్కడా ఇంత అన్నంపెట్టే అన్నపూర్ణే కనబడలేదా?

గోష్పాదం

లేదు, బాబో! లేదు

సంధ్య

ఈ పాపులకు అన్నపూర్ణ ఎక్కడ కనబడుతుంది?

పరమశివుడు

ఇప్పుడేమిటి గత్యంతరం?

అరుంధతి

దేవా! ఏమిటిది? ఈ ప్రజలింత దీనావస్థలో వున్నారేమి?

శివోహం

నీ చలవే!

పరమశివుడు

ఓరి డిప్పకాయా! పెద్దవాడి వయావే!

శివోహం

అది మీచలవ!

ప్రజలు

తల్లీ! ఆకలి! ఆకలి!

పరమశివుడు

లోకం మహాదుర్భిక్షంలో చిక్కుకొన్నది. ఆకటితో చస్తున్న ప్రజలకు ఏ పతివ్రతా సహాయపడలేక పోయింది

అరుంధతి

అన్నపూర్ణాదేవి?

*(ఎవరూ మాట్లాడరు)*

పరమశివుడు

అరుంధతీ! నీవు ఈ ప్రజలను రక్షించు

సంధ్య

మాచేతి అన్నం పిల్లు తినరుగదా!

ప్రజలు

*(ఏకకంఠంతో)* తింటాం, తల్లో! తింటాం తింటాం.

అరుంధతి

ఈ పని అన్నపూర్ణాదేవి చెయ్యవలసినట్టిది

పరమశివుడు

ఇప్పుడు ఆమెను ఎక్కడ తెగళ్లను ? ఏ కొండలలోనో తపస్సు చేసుకొంటున్నది.

వసిష్ఠుడు

(అరుంధతితో) నీ పీపని చెయ్యగలవు. ప్రయత్నించు

అరుంధతి

(*వసిష్ఠుడి పాదరజం నొసట ధరించి*) నాథా !

నేను పతిభక్తి కలదాననేని, తల్లి
అన్నపూర్ణమ్మ నాపట్ల నున్న దేని,
పిండివంటలుగా మారు కొండరాళ్లు
తరువులు ఫలించు, నిండును దొరువు లిపుడె.

గోష్పాదం

ఓహో ! బూరెలు ! గారెలు !

కుంభోదరం

బొబ్బట్లు ! మినపట్లు !

ప్రజలు

అన్నం ! కూరలు !

(రాసులు రాసులుగా పడివున్న పిండివంటలమీద ప్రజలంతా ఒక్కపెట్టున మూగుతారు, దోసిళ్ళనిండా తీసుకొంటారు, నోళ్ళనిండా కుక్కుకుంటారు, ఆమెను అభినందించడానికి కూడ ఇప్పుడు వారికి తీరికలేదు, అవకాశమూ లేదు.)

శివోహం

(ముందుకువచ్చి) ఆర్యులారా! ఇక మనం ఆ చెరువు గట్టుకు చేరడం మంచిది. పదండి (ప్రజలందర్నీ తీసుకుని నిష్క్రమిస్తాడు.)

పరమశివుడు

(సంతోషంతో) అరుంధతీ! నీవీ మహాత్కార్యం సాధించినందుకు నీకొకవరం ఇస్తున్నాను నీకు వ్యోమమండలంలో నీ నాధునిచెంత ఒక శాశ్వతస్థానం లభించగలదు

(అందరూ అంజలిఘటిస్తారు)

లోకంలో ప్రతి నూతన దంపతులు ముందుగా నీకు నమస్కరించి నీ యాశీస్సులు పొందగలరు

నీవు వైదిక భారతీయతకు, మహా భారతవంశానికి మాతవు కాగలవు. వసిష్ఠా! ఇక మేం వెళతాం.

సంధ్య

అక్కా! సెలవు. ప్రణయవాల్లభ్య దేవతవై, ప్రణవాంశయైన వసిష్ఠుణ్ణి పలుకో.

వసిష్ఠుడు

సంధ్యా!

సంధ్య

బావగారికి బెంగ అక్కర్లేదు ఉదయ, సాయం సంధ్యా వేళలలో ఎప్పుడు పిలిస్తే అప్పుడు వస్తాను

అరుంధతి

నన్నేమిచేసి పోతున్నావు ?

సంధ్య

వసిష్ఠుణ్ణి ఇచ్చి పోతున్నాను నీ ఆశ్రమంలో నా ఉద్యోగం ఇక బావగారు చేస్తారు.

అరుంధతి

(ప్రాధేయపడుతూ) సంధ్యా ! నీవు లేకుండా నేను వుండలేను. తరువాత ఎప్పుడో వెలుదువుగాని

సంధ్య

(నవ్వుతూ) చంటిపిల్లవయ్యావే, తల్లీ ! నీకేనా బెంగ ? నాకు లేదా ? నేను ప్రతి ఉదయం మిమ్మ్మి లేపడానికి వస్తాను, ప్రతిసాయంత్రం మీకు జోల పాడిపోతాను. సరేనా ?

అరుంధతి

మరి, మధ్యాహ్నం ?

సంధ్య

మధ్యాహ్నం చెట్లనీడల వెలుగు చీకట్లలో మీతో ఆడుకుంటాను

(పరమశివుడు ఇదంతా చిరునవ్వుతో తిలకిస్తున్నాడు అంతకుముందే అక్కడకు తిరిగివచ్చిన శివోహాన్ని అరుంధతి తల నిమిరింది సంధ్యను కౌగలించుకొన్నది. వసిష్ఠుడు శివోహాన్ని సందిట్లోకి తీసుకున్నాడు తర్వాత అరుంధతీ వసిష్ఠుగిద్దరూ పరమశివుడికి సాష్టాంగపడి లేచారు.)

పరమశివుడు

సుఖీభవ! శుభం భూయాత్!

సంధ్య

ఇక నీవు—నీ వసిష్ఠుడు (పరమశివునిచేయి పట్టుకొని నవ్వుతూ వెళ్ళిపోతుంది శివోహం రెండవ వైపుకు వెళతాడు ప్రకృతి ప్రశాంతంగావుంది ఏదో మధురవేదన వాతావరణంలో కెరటాలు వేస్తున్నది. అరుంధతి, వసిష్ఠుడు క్షణకాలం మౌనంగా అటుకేసిచూచి—ఇక భరించలేక—ఒకరి కౌగిట్లో ఒకరు ఐక్యమైపోతారు ఆశ్రమం అనురాగంతో అవ్యక్తమధురంగా గానం చేస్తున్నది. ఆకాశం ఆనందబాష్ప తారకలతో విలసితమై పులకితమయింది. మానససరోవరం నుంచి ఒక అపూర్వ మధురకల్యాణగానం పూలమీదికిదిగి ఆడుకొంటున్నది.)

కల్ప శ్రియర్లతా! కల్యాణదేవతా!
వివిధమానవ సమైక్య విధానదాయినీ!
భాగవతరూపిణీ! భారతోద్ధారిణీ!
మాతంగ కన్యకా! మనసాస్మరింతు.

సమాప్తం